# శ్రీ బ్రహ్మానందలీలలు

(ఎనిమిదంకముల నాటకము)

27-7-37.

మొదటికూర్పు

1000

1937.

0-12-0 (గ్లేజు)

0-8-0 (సెమిగ్లేజు)

కవిశేఖర

వడ్డెపాటి నిరంజనశాస్త్రిగారు.

# రెండు మాటలు

ఈ నాటకరాజము శ్రీ పోతులూరు వీరబ్రహ్మేంద్రస్వాముల వారి అతిమానుష జీవిత కథను దెలుపును. శ్రీ స్వాములవారి జీవితములోని కొన్నిలీలలుమాత్ర మిందు జిత్రింపఁబడియున్నవి. "ధీనిధి తత్వజ్ఞుఁడు తత్వానందస్వామి అతులితానంద కథాధీనత సమకూర్చిన వాచానివహమును" చాయగాఁగొని శ్రీ నిరంజనశాస్త్రిగారు ముద్దులొలుకు తేటతెనుఁగున నీ కబ్బమును వెలయించినారు. ఇందు సకల వర్ణాశ్రమ మతస్థులకును ఆదర్శప్రాయములగు నీతులు, తత్వోపదేశములు, కథానుసరణమున అతి సులభముగను మనోహరముగను బొందుపఱుపఁ బడియున్నవి. సర్వమతసహనము, సర్వసోదరభావము, పూర్ణనైతిక జీవనము, స్వధర్మ నిర్వహణము, మున్నగు నెన్నెని సద్విషయములు పండితపామరుల కుపయుక్తముగు రీతిని వివరింపఁ బడియున్నవి. ఈ నాటకమును బ్రదర్శించువారు తమ వీలు ననుసరించి కొన్నిరంగముల విడిచి ప్రదర్శనకాలపరిమితికి అనుకూలముగ దీనిని క్లుప్తీకరించుకొను నవకాశము కలదు.

కారణాంతరములచే ఇందు అచ్చుతప్పులు పెక్కులు దొరలినవి. కొలఁదిపాటి దిద్దితప్పొప్పుల పట్టికను జేర్చితిమి. అయినను పాఠకులకు బాధాకరములుగాని 'ళ ల, ఱ ర, ణ న, ల సంయోగములును, అర్థానుస్వారస్ఖాలిత్యములును, సవరింపఁ బడలేదు. ఈ పుస్తకమును బ్రకటించుటలో కొలఁదిగనో గొప్పగనో చందానిచ్చి ప్రోత్సహించిన చందాదారులకు కృతజ్ఞులము. దివ్యనాయకశోభితమై, అనేక గుణమణుల కాకరమైన ఈ నాటకము అనతికాలముననే ఆంధ్రమహాజనుల మన్ననల నందఁగలదని యాశించుచున్న—

సంపాదకుఁడు,
ఉభయభాషాప్రవీణ
కొండూరు వీరరాఘవాచార్యులు.

ధాతృమాఘము
10—3—1937

I

# ఈ నాటకమునవచ్చు పాత్రములు.

## పురుషులు

| | |
|---|---|
| సూత్రధారుఁడు | |
| అత్రి. | ఒకఋషి |
| వీరనారాయణ | కథానాయకుని వివిధనామములు |
| వీరప్ప | |
| వీరబ్రహ్మేంద్రస్వామి | |
| ఇద్దఱుబ్రహ్మచారులు | |
| వీరభోజాచార్యులు. | వీరనారాయణుని పెంపుడుతండ్రి. |
| వేంకటరెడ్డి | వీరప్ప కొలిచినరైతు |
| రాముఁడు | ఆలకాపరులు |
| గోవిందుఁడు | |
| సూరారెడ్డి | |
| బసవారెడ్డి | |
| శివకోట్యాచార్యులు | గోవిందమ్మతండ్రి |
| సిద్ధుఁడు | వీరబ్రహ్మేంద్రస్వామి ముఖ్యశిష్యుఁడు |
| మీరుసాహెబు | సిద్ధునితండ్రి |
| గోవిందయ్య | వీరబ్రహ్మేంద్రస్వామి కుమారులు |
| పోతులూరయ్య | |
| ఓంకారయ్య | |
| శివరామయ్య | |
| గిరిరాజయ్య | |
| పుష్పగిరిబ్రాహ్మణులు. | |
| నబాబు | కడపప్రభువు. |

## స్త్రీలు.

| | |
|---|---|
| నటి | |
| రపాపమాంబ. | వీరబ్రహ్మేంద్రస్వామి పెంపుడుతల్లి |

| | |
|---|---|
| అచ్చమాంబ. | వేంకటరెడ్డిభార్య |
| గోవిందమాంబ. | కథానాయిక |
| కృష్ణవేణి<br>కమల | చెలికత్తెలు |
| ఆదంబీబి. | సిద్ధునితల్లి |
| వీరనారాయణమ్మ. | వీరబ్రహ్మేంద్రస్వామికూతురు |
| ఈశ్వరమ్మ. | గోవిందయ్యకూతురు |

సమయానుకూలముగ మఱికొన్ని పాత్రములువచ్చును.

# అంకితము.

ఉ॥ శ్రీనిరవద్య హృద్యతర ♦ సేవనభావనలన్ బ్రపంచసం
ధానవిధానముల్ వెలయఁ ♦ దార్చుచు, నెల్లరు సంతరింప వి
జ్ఞానపరంపరల్ జగతిఁ ♦ జల్లెడు విశ్వకృదీశ్వరుండభి
జ్ఞానవిలాసుఁ బ్రోచుతను ♦ "నాయని వేంకటరంగ రాణ్మణిన్"

సీ॥ ఏభూవిభు వికాస ♦ మిద్ధవిద్యాబుద్ధు
లనుపమ విఖ్యాతి ♦ నలరుచుండు,
ఏఱేని డెందంబు ♦ శ్రీరామకృష్ణాఖ్య
పరమహంసుని నిత్య ♦ భక్తి నెఱపు,
ఏనరేంద్రుని భూరి ♦ దానలసత్ప్రౌఢి
సర్వసత్కార్య ప్ర ♦ సక్తిఁ జూపు,
ఏయేలికమతాభి ♦ హితవృత్తి యెల్లరి
మెచ్చుకోలుగ నచ్చి ♦ మెఱయుచుండు,

తే॥ గీ॥ అరయనేరాజు మునగాల ♦ పరగణాధి
పత్యమున మించి, సాహితీ ♦ పటిమ గాంచి,
రాణఁజెన్నొందునో; యట్టి ♦ "రంగరావు
బహదు" రతులుఁడు, సద్గుణా ♦ భరణయుతుఁడు!

శా॥ ఆనిష్ఠానిధికిన్, యశఃప్రసర లో ♦ కానంద సంధాయికిన్,
దానజ్ఞానవిలాస శేముషికి, శు ♦ ద్ధప్రక్రియాశేషసం
ధానవ్యక్తికి, నంకితంబిడుదుఁ, ♦ బూర్ణప్రేమ సంధిల్ల ని
త్యానంద ప్రథితస్థితిన్ వెలయు బ్ర ♦ హ్మానంద లీలాకృతిన్;

ఇట్లు
కవిశేఖర,
వడ్డెపాటి నిరంజనశాస్త్రి.



# శ్రీ బ్రహ్మానందలీలలు

---

## ప్రథమాంకము.

---

నాంది

మ॥ తమ మాయామహిమన్ జనించునవి, కాంతారాంతరావాసు, లు
త్తమగా స్వార్థ్యజను ల్కాఁచునవి, యద్వైతామృతంబున్ సమ
స్తమతార్థంబులఁ బ్రస్ఫురించునవి, సిద్ధశ్రీమనో మంగళా
ఢ్యములైనట్టివి, దన్పుఁగాత! మిము బ్రహ్మానంద లీలా విధుల్;

మఱియు

తే॥ నటుఁడగుచు నెవ్వఁడాపనసాతమూర్తు
లోలసిగిఱికొన; మునులు వేల్పులు నెవానిఁ
బొగడఁగాఁజాల, రెవ్వాఁడు బూన్కిఁదెలియ
నేర, రవ్వాఁడె శుభదర్శనీయుఁడగుత!

(సూత్రధారుఁడు ప్రవేశించును)

సూత్ర:—(ఆత్మగతము) బ్రహ్మవలోకనతత్పరులై యున్నవారుమ
నుంపు సభాస్తారులకు తాసహాభంగమొనర్పఁడగిను. ఇంక నాల

సింపరాదు. సర్వమును సంసిద్ధముగనుండి యుండును. నటినిఁ బిలిచి విచారించెదఁగాక;

నటి:— (ప్రవేశించి) ఆర్యా! ఈయుద్వేగమునకుఁ గతంబెయ్యది?

సూత్ర:— నీవలంకరించుకొనుట పూర్తియయ్యెనా?

నటి:— నాయలంకరణము పూర్తి యయ్యెనో లేదో, నిర్ణయించు కర్తలు మీరుగదా! నాకెట్లు తెలియును!

సూత్ర:— మితిమీరి సతతము ఆభరణములకై బాధించు నీకోరికల నెల్ల సఫలముగావింపలేదనియా, నీనిష్ఠురములు?

నటి:— క్షమింపుఁడు. నిష్ఠురములు పలుకను. నన్నలంకరించుకొనుతఱి నెల్ల మీనేత్రములతోడనే నన్ను నేఁజూచుకొనుచుందును.

సూత్ర:— ఓసీ! నీవెంతటి చతురురాలవే?

ఆ। ఎవరికండ్ల వార ♦ లీక్షించుదురు గాని,
కలరె యొరులకండ్లఁ ♦ గాంచువారు?
ఎఱుఁగవే కుహూపి ♦ యేనియుఁ గడలేని
తీర్పులోలయ నోడలు ♦ దిద్దుకొనుట?

ఇంతియకాక

తే। తా మొకండువిలాసంబుఁ ♦ దాల్చి పరుల
నల్లిగెసేయుఁడని బిట్టు ♦ నాడుచుంద్రు;
వారికోర్కెల నీడేర్ప ♦ వలసిగాదె
యెన్ని యోజన్మముల నెత్తు ♦ టీశ్వరుండు?

నటి:— మనసమాజమునమాత్ర మటుగాదులెండు. మీయానతిఁదలఁ దాల్పనివారెవరు?— నన్నతితీవ్రముగఁబిలిచితిరి. ఆ యాదేశ మేమొ తెలుపరైరి.

సూత్ర:— సఖీ! మఱచితిని. నిన్నుఁజూడ నన్ను నేనేమఱతును. జ్ఞప్తికిఁ దెచ్చితివి, కృతజ్ఞుఁడను.—వినుము. "బ్రహ్మానందలీల" యను నాటకమును బ్రదర్శింప సభాస్తారులచే నాజ్ఞప్తుఁడనైతిని.

తత్కార్యమున నప్రమత్తవై మెలంగుచు, నాకన్నివిధములం దోడ్పడవలయును.

నటి:—ఆర్యా! మనమిప్పుడు నాటకప్రదర్శనములతో విసిగియుంటిమి. సభ్యులును చూచి చూచి వేసరియుండిరి. ఇటీవల నాటకావలోకనమే యవినీతికార్యమని చాటుపెద్దలును బయలుదేరినారు మనమింకనీవృత్తిని మానుటొప్పు.

సూత్ర:—ఈనాటియువకులు విచిత్రభావములతో మెలఁగుచుంట సత్యము. భిన్నభిన్నసంప్రదాయములువచ్చి భారతభూమియందు సమకూడినవి. దేనికది స్వతంత్రరూపమున శ్రేష్ఠమకానగును. అన్నియు సమ్మాన్యములే. కాని వానిని స్వీకరణముసేయువారు, స్వీయసంప్రదాయమును బ్రధానముగ గ్రహించి తదనుసరణముగ నితరములఁబరిగ్రహించుచు, వానికనుసంధానము గూర్చిన మేలగును.

ఉ॥ ఇప్పటిబుద్ధిమంతులొ యథేచ్ఛ నొకింతవిచారణంబు చే
నొప్పుగఁదోచుకర్జమున యుక్తమయుక్త మెఱుంగఁబోక, తా
రొప్పరికింప కన్యవిధులొప్పక, స్వీయగురుత్వమెంతయుఁ
జెప్పుచు, విఱ్ఱవీఁగుదురు; చెప్పనదేమిఁ కలోకమెట్టులో!

నటి:—క్షమింపుఁడు! ప్రస్తుతమును మఱచినట్లున్నారు: మనమిప్పుడు సంస్కర్తలము కాముగదా!—ఈప్రదర్శింపఁబోవు నాటకముయొక్కయోగ్యతయెట్టిది? కథానాయకునిప్రభావమెటువంటిది? కృతికర్త యెట్టిఁడు? కృతిభర్త యెవ్వరో?—దీనిం బ్రదర్శించుచోఁ గలుగుఫలమేమి?

సూత్ర:—ఎంతటి మందబుద్ధివి! ఈసభ్యులఁబరికించితివా? సుగుణఖనులు, విద్వద్వర్యులు, పరమపూజ్యులు, సకలవ్యవహారదక్షులు, రసగ్రహణపారీణులు. కావున మనయర్హతనుస్థాపించుకొనుబాధ్యత మనయందేయుండును. ఫలప్రాప్తికై దిగులుచెంద

నేల? ఈనాటకప్రదర్శనము భక్తిముక్తిప్రదాయకమనుటకు సందియముండఁజాలదు. ఏలన?

ఉ॥ పాటిదొలంగి వాసనలు ♦ పైఁబడ సంసృతిఁగుందకు నీపరిజా
కోటి కనంతమోదమొసఁ♦గూర్పఁగ మోక్షకవాటపాటవో
ద్ఘాటన దివ్యరంగము ప్ర♦దర్శనముం బొనరించు నాజగ
న్నాటకకర్త, యీకథకు ♦ నాయకుఁడౌట యెఱుంగవే సఖీ?

నటి:—ఆర్యా! వీరేశ్వరస్వామి యానందలీలయా యిది?

సూత్ర:—అవునవును. అతఁడు మనయిష్టదైవతంబగాన నీకు నేనంతగా వివరించి చెప్ప నగత్యముండదు. కృతికర్త యందువా? అతఁడును మనకుఁ జిరపరిచితుఁడే. మిత్రుఁడే. తన కవితా మాధుర్యమున రసజ్ఞుల మెప్పించి, "కవిశేఖర" బిరుదముచే బహూకరింపఁబడిన మన నిరంజన సుధీంద్రుఁడే సుమీ?

నటి:—ఆర్యా! ఆకవివర్యుఁడైనను వీరగురువచనకృపాసంపాదితసరస కవితాధురంధరుఁడె. కాని బ్రహ్మానందలీలారహస్యమును గుర్తెఱింగిన యాధ్యాత్మికతత్త్వకోవిదుఁడు కూడనగునా?

సూత్ర:—కాకేమి? అట్లైనను మన కవీంద్రుఁడు—

కం॥ ధీనిధి, తత్త్వజ్ఞుఁడు, త
త్త్వానందస్వామి, యతులి♦తానందకథా
ధీనత సమకూర్చిన వా
చానివహము ననుసరించి ♦ చాయనొనర్చెన్;

నటి:—బహుగ్రంథనిర్మాతయుఁ బరమతత్త్వకోవిదుఁడు నగు నాస్వామి తల్లజునిచే సంకలితమైన నాటకమును బ్రదర్శింప మనమెంతయు నదృష్టవంతులము. అన్నియుఁజక్కఁగ సమకూడినవి. అందువలననా,? సభ్యులు బ్రహ్మానందతత్పరులై యువ్విళ్లూరుచుండిరని మీరు మొదటనే సెలవిచ్చిరి? నాకప్పుడామాట యర్థము కాలేదు.

సూత్ర:—అర్థముకాకుండిన వెంటనే యడుగ లేదేమి?

నటి:—నేను కడుంగడు బుద్ధికుశలతచే నొప్పుదాననని మీరు పొగడు చుందురుగదా!

సూత్ర:—కాన నేమి?

నటి:—నేనొకింత గర్వాక్రాంతమనస్క నైతిని. తెలియకున్నను, ప్రశ్న నడిగిన నా తెలివి లేమి బయటపడునో గదా యనునభిమాన ముతో వర్తింతును. నిజము తెలిపితిని. మీరిక ముఖస్తుతులు మానుఁడు.

సూత్ర:—నా యవి ముఖస్తుతులు గావు. అనంత ధీసాగరము నీయందు న్నది. ఆసంగతిని నీకు స్ఫురింపఁ జేయుటకై నేను నిన్ను హెచ్చరించుచుందును. నేనే కాదు; నిన్నెవరు పొగడినను ఆ పొగడ్తకుఁ దగిన యర్హతను వెలువరించి ప్రకటించుటకై ప్రయ త్నింపుము. వృథా గర్వమును వహింప వలదు. నేనును సత్య మునే వచింతును. నీవు లేకుండ జగమున నేను దేనిని సాధింపఁ గలను? చూడుము!

తే॥ ప్రకృతిచెలువ, వెంటఁ ♦ బ్రాఁకులాడక యున్న
జగము బ్రహ్మమెట్లు ♦ జరుప నేర్చు?
దాన గాదె లోక ♦ తత్పర క్రీడమై
బాలుఁడౌట మునుల ♦ పజ్జఁ గనుట?

నటి:—ఆర్యా! మీ ప్రస్తావనచే మున్యాశ్రమ లీలా సంచారులగు నరఋషి వీరనారాయణ పాత్రలు సిద్ధమగునని తోఁచు చున్నది. అవసర కార్యముల నిర్వర్తింపఁ బోవుదము.

(అని నిష్క్రమింతురు)

ఇది ప్రస్తావన.

---

# బ్రహ్మానందలీలలు

## ప్రథమాంకము

### మొదటి రంగము

అత్రిముని యాశ్రమము

(అత్రిఋషి సమీపమునఁ గూర్చుండి కొందఱు బ్రహ్మచారులు సంధ్యావందనముఁ జేయుచుందురు. వీరనారాయణుఁడను బాలుఁడు పిల్లనగ్రోవి నూదుకొనుచుఁ బ్రవేశించి తానును దక్కిన బాలురతోఁ బాటు సంధ్యావందనముఁజేయ యత్నించుచును)

అత్రి;—చిన్ని తండ్రీ! నీవేమి చేయఁ గోరుచున్నావు?

వీర:—తాతా! అంతా యేంచేస్తున్నారూ?

అత్రి:—వీరలు సంధ్యావందనముఁ జేయుచున్నారు.

వీర:—నేనూ అదే చేస్తాను.

అత్రి:—నీవిప్పుడు సంధ్యావందనము సేయఁ దగదు. నీకుఁ జెప్పిన పద్యాలను జదువుకొనఁబొమ్ము. చాలును.

వీర:—వీరు చేస్తే నేను చేయరాదూ? నేనెప్పుడు చెయ్యాలీ?

అత్రి:—నీకు ఉపనయనము అయినతరువాత నీవు సంధ్యనర్చింప నగును.

వీర:—అప్పుడూ ఏమొస్తుంది?

అత్రి:—సాహాయ్యముగా నుండెడి కన్ను. (నవ్వుచు) కొన్నాళ్లుండి నచో నీకు వడుగు చేసెదము. జందెము వేయుదుము. అప్పుడు నీకు మూడవ కన్ను వచ్చును.

వీర:—వస్తే?

అత్రి:—అప్పుడు సంధ్యావందనము చేయ వచ్చును. అందాక నీవు సంధ్యార్చన సేయరాదు.

వీర:—వీళ్లకు మూడో కన్ను వచ్చిందా? ఏదీ! (అనుచు వటువుల ముఖములఁ దడవి చూచును.)

అత్రి:—ఆకన్ను పైకిఁ గన్పించెడిది కాదు. ముఖమున—కండ్లకునడుమ నుండును.

వీర:—అది అందఱికూ ఉండదూ? నాకు లేదూ?

అత్రి:—అందఱకు నుండును తండ్రీ! నీకు నున్నయది. ఆ యుపనయనమును గురువు కొన్ని మంత్రముల బోధించి తెఱవ వలెను. అప్పుడు నీ వీకండ్లతోఁ జూడలేని పారమార్థిక విషయములను జూడ నేర్తువు.

వీర:—తాతోయి! అప్పుడప్పుడే నామూడో కన్ను తెఱచుకొంటుంది.

అత్రి:—అదెట్లోయి?

వీర:—నాకప్పుడప్పుడు దేవుళ్లు కనపడ్తారు. చిత్రవిచిత్ర మైన పూదోటలు, కోనేర్లు, కనబడుతవి. చక్కని ఆశ్రమాలుంటవి. మహామునులు, తళతళలాడు దేవతలు, కనపడ్తారు.

1 బ్రహ్మచారి:—స్వామీ! వీనికి గలలు తఱచుగా వచ్చును. ఇటువంటి కలలందఱకు వచ్చును.

2 బ్రహ్మచా:—వీరనారాయణుఁడు సగము పిచ్చివాఁడండీ! కూర్చుండి కలలు కనుచుండును. మేమాడుకొను నప్పుడు చెట్లక్రిందఁ గూర్చుండి నవ్వుచుండును. ఏల నవ్వెదవన్న, "అదుగో ఆ చిత్రము చూడండి. దేవతా స్త్రీలు నాట్యము చేయుచున్నార"నును.

అత్రి:—నిజమేనా వీరనారాయణా?

వీర:—నిజమే తాతగారూ!

1 బ్రహ్మచా:—నిద్రలో అందఱును కలల జూడగలరు.

2 బ్రహ్మచా:—వీఁడు నిద్ర పోకుండఁగనే కలలఁ జూచునుగదా!

1 బ్రహ్మచా:—కండ్లు మూసికో, అన్ని చూచుచున్నా ననుకో. నీకును కలలు కాన్పించును.

వీర:—కండ్లు మూసికో! ఎందుకు? కండ్లు తెఱచి యుండగనే నాకు చిత్రాలు కనబడుతవి.

2 బ్రహ్మచా:—పిచ్చివాండ్రకు మెలకువగ నుండఁగనే కలలువచ్చును.

వీర:—తాతా ! నాకు పిచ్చి పట్టిందా?

అత్రి:—నీకు పిచ్చి యేలపట్టును తండ్రీ! నీకేమేమి యెట్లు కాన్పించునో చెప్పుము. చిత్రముగ నున్నది.

వీర:—ఎక్కడైనా కదలకుండా కూర్చుంటా. చాల సంతోషము కలుగుతుంది. చూస్తుండగానే ఎదుట కనపడే చెట్లు, పక్షులు, మృగాలు, ఏవీ ఉండవు. నీలంగా మబ్బు కనబడుతుంది. అది పెద్దదై తళతళ లాడుతుంది. అదే పచ్చనై ధగధగ లాడుతుంది. బంగారంలాగు మెఱుస్తుంది. దానిలోనుంచి దేవతలు వస్తారు.

అత్రి:—బాలకా! ఇట్టి దృశ్యములు చూడఁగోరు ప్రయత్నములు తఱచుగఁ జేయకుము.

వీర:—నేనేమన్నా చూడాల నన్నానా? అవే కనబడుతవి! దేవతలు వారే వస్తారు!!

1 బ్రహ్మచా:—దేవతలు గారు వారు, దయ్యాలు.

అత్రి:—చీ. చీ. అట్లనఁ దగదు. దయ్యాలేమిటి? వానిఁ దలంపరాదు. వానిం గూర్చి చిన్నవారలు ప్రసంగింపరాదు.

2 బ్రహ్మచా:—దయ్యాలో, దేవతలో, ఎట్లుందురో చెప్పనిండు.

వీర:—చెపుతా వినండి! అయిదు తలలవాడొకడు మొదట తపము చేస్తూ కనబడును. కొంచెము సేపటికి, కండ్లు తెఱచి నవ్వును. నాలుగు తలల వాడొకడు వచ్చును వాని వెంటే నవ్వుచు చక్రము త్రిప్పుకొనుచు నాల్గుచేతులవాడొకడు వచ్చును. వీరలు మొదటివానికి దండాలు పెట్టుచు దగ్గఱకు పోదురు.

1 బ్రహ్మచా:—చిత్రనాటకముగా నున్నదే!

2 బ్రహ్మచా:—వెట్టివాండ్రకు మంచికలలుకూడ రావచ్చును.

అత్రి:—మీరూరకుండుఁడు! వాని మాటలన్నింటి వినుఁడు.

వీర:—చిత్రచిత్రమైన వారందఱు మెఱుస్తూ వస్తారు. కండ్లు మిఱు మిట్లు గొనును. అన్నిటికంటె చిత్రము కటుంది. వీరలందఱు ఆ అయిదు మొగాలవాని దగ్గఱ కొస్తారు. వానిలో గలసి పోతారు.

అత్రి:—ఆపిమ్మట?

వీర:—ఆపిమ్మటా, అంతా మాఱి ఒక్కటే తేజస్సుగా మాత్రమే కనబడుతుంది, సూర్యుడే వచ్చినట్లు...

1 బ్రహ్మచా:—సూర్యుడు నీకడకు వచ్చునా ?

వీర:—అతనికి మించిన తేజమే వస్తుంది.

2 బ్రహ్మచా:—వచ్చి?

వీర:—అది నన్ను చుట్టుకొట్టుంది. నేను దానిలో కరగి పోతా.

1 బ్రహ్మ—అంటే?

వీర:—నా రూపేమీ కనబడను. అంతా నిండుతుంది ఆ తేజస్సు. ఉండేది నే నొక్కణ్నే!

2 బ్రహ్మచా:—బలే! చిత్రము. నీవు పడిపోదువా? కూర్చుండి యే యుందువా?

వీర:—నా కేమియు తెలియదు.

అత్రి:—ఇట్లెంతసేపుం డఁగలవు?

వీర:—ఏమో! చాల సేపుంటాను. ఎంతసేపో!

1 బ్రహ్మ:—ఈకలలేమిటి? కడు చిత్రము!

అత్రి:—అవును. చిత్రములే. మీ యుపనయనము పూర్ణవికాసముఁ జెందినచో మీకును లభింప వచ్చును.

2 బ్రహ్మ:—వీనికి ఉపనయనమే లేదు గదా!

అత్రి:—అది వీనియందు సహజముగ నున్మీలిత మైనదని తోఁచు చున్నది. ఇది బహునిగూఢ విషయము. నేనిప్పుడు దీనిని మీకు వివరించి చెప్పఁజాలను.

వీర:—తాతగారూ! నాకు పిచ్చిపట్టిందా? నాకు భయమువేస్తున్నది.

అత్రి:—నీది పిచ్చికాదు తండ్రీ! భయమునకుఁగారణములేదు, ఆనంద ముగ నుండుము.

(తెరవ్రాలును)

---

రెండవ రంగము.

(వనసీమ, వీరభోజా చార్యులును, వీరపాపమాంబయును, ప్రవేశింతురు.)

వీ॥భో:—సతీ! నీవు చాల నలసితివి. ఒకింత సేదఁ దీర్చికొమ్ము. ఎంత శ్రమ పడినను, ప్రాప్తము లేనిది నరునకుఁ దృణమయినను లభింపదు సుమీ.

వీ॥పా:—ఈమాట నందఱును జెప్పుచునే యుందురు. కాని యెల్లరును శాంతచిత్తులై కూర్చుండక పడరాని పాట్లఁ బడుచుందురు. మనము చూడరాదా? పుత్రసంతానార్థులమై యెట్లు తపించు చుంటిమో. ప్రాప్తము లేదని తెలిసి మనమేల మఱలరాదు?

వీ॥భో:—ప్రాప్తమన్నఁ గర్మమే. ప్రాప్తమనఁగా నర్హతయని భావింతుము గదా? కర్మ సేయక యర్హత యెట్లు వచ్చును?

తే॥ గీ॥ యత్న సిద్ధులు నొక పని♦యందె యడఁగు;
వెలఁదిరో! కష్ట మీరెంటి ♦ వేఱు పఱుప,
పూవె పండగు, నిది యొక్క♦పూన్కి సూవె!
కర్మ మొనరింప కర్హత ♦ గలుగఁ గలదె?

వీ॥పా:—అట్లయినఁ బ్రారబ్ధ మందు రది యేమి? సర్వమునకుఁ గర్మమే కారణ మగునేని ప్రారబ్ధ మేమి? ప్రాప్త మేమి?

వీ॥భో:—ఓసి వెఱ్ఱిదానా! నీకెంతటి యజ్ఞానము! కర్మముఁ జేసినఁ గదా ప్రాప్తి యేర్పడును. పూర్వము చేసిన కర్మఫలమున నిప్పుడనుభవ యోగ్యమగు భాగమునే ప్రారబ్ధమం దురు. దీనినే ప్రాప్తమని చెప్పఁదగును.

1072



వీ।పా:—ప్రారబ్ధమనఁ బూర్వజన్మలందు మనముచేసిన కార్యముల ఫలమన్నమాటయే గదా? అదియే ప్రాప్త మంటిరి. ప్రాప్తము లేక యేదియు లభింపదందురు. ఇఁక మన కడంకలకుఁ బ్రయోజనమేమి ?

వీ।భో:—తెలియుట లేదా ? ఇప్పటి మన కడంకలే ముందునకుఁ బ్రారబ్ధములగును. పూర్వపుఁ గడంకలిప్పటి ప్రారబ్ధము లైనవి.

వీ।పా:—మనమాట విచారించుకొందము. మనకిప్పుడు సంతానము లేదయ్యె. పూర్వమట్టి కర్మలఁ జేయలేదు. కావున సంతానప్రాప్తి లేకపోయినది. ఇప్పుడు మన చేయు తీర్థయాత్రలకు, వ్రతములకు, నోములకు, ఫలము మనకీ జన్మమున రాదుగదా ? ఈశ్రమ లన్నియు రాఁబోవు జన్మలో ననుభవించు సుఖములకేనా? నేనింకను సంధ్యాగఫల ముందునేమొ యని, యాశించుచున్నాను. నాయాస నిరాశయే?

వీ।భో:—అట్లేల గావలయును?

తే।గీ॥ ఏండ్లు మీఱిన మామిడుల్ ♦ పండ్ల నిచ్చు;
కాయలొసఁగును వంగమొ ♦ క్కలు బిరాన;
కర్మఫలమొందు నీజన్మఁ ♦ గాక యుండు,
నొకటి యీపుట్టువందున ♦ నొసఁగుచుండు;

వీ।పా—అవు నవును. మఱికొన్ని చిరకాలమునకుఁ గూడఫలింపవచ్చును. మనమిప్పుడు నాటిన నారికేళములఫల మెప్పటికోగదాయనుభవసిద్ధమగుట. అట్లే కొన్నికర్మములు అనేకజన్మాంతరములు గడచినఁ గానిప్రారబ్ధ రూపమును బొందవన్నమాటయే?

వీ।భో:—సందేహమేల? అదట్లే.

తే।గీ। చేసినిల్పిన కర్మసం ♦ చితమ యిపుడు
ప్రాప్తమ గుచుండు, నదియె ప్రా ♦ రబ్ధమందు
రి; పుడొనర్చున దాగామి ♦ చపల నయన!
అదియు నీజన్మ, మఱుజన్మ ♦ నంది వచ్చు.

వీ॥పా:—కావున మన మెల్లపుడు శ్రద్ధతోఁ గర్మల నాచరింపవలెనని తేలుచున్నది. భగవంతునిపై భారము వైచి యూరకుండరాదు.

వీ॥భో:—అవు నవును. ఆభగవంతుఁడు మన కర్మలననుసరించున ట్లను గ్రహించుచుండును. కావున వాని యనుగ్రహమును సంపాదించు కర్మము సేయుచుండవలయును.

వీ॥పా:—కేవలభక్తి వ్యర్థమేనా?

వీ॥భో:—ఎంతటి వెఱఁగుఁదనము! భక్తి కర్మగాదా? భక్తి మానసిక కర్మయనవచ్చును. మానసికకర్మకును, కాయ కర్మకును దూర మంతగా లేదు. సంకల్పమూలమునఁగాని, కర్మసామాన్యముగా నుండదు.

వీ॥పా:—కావున మనతీర్థయాత్రలు వ్యర్థములు కావు. ఎన్నఁడో ఫలించును.

వీ॥భో:—ఎన్నటికిని వ్యర్థములు కానేరవు. మఱియు నెన్నఁడో ఫలించునని తూష్ణీంభావ మూనరాదు. సాంద్రభక్తిచేత ఫలప్రాప్తి నెంతత్వరితముగనైనఁ బొందవచ్చును.

వీ॥పా:—ఇప్పుడు తెలిసినది. నే నప్పుడప్పుడు విసుగుఁజెంది నిరాశకుఁ బాల్పడుచుందును. నిరాశకవకాశము లేదని యిప్పుడు గ్రహించుచున్నాను.

వీ॥భో:—నిష్కళంక సాంద్రభక్తితో దైవధ్యాన మొనరింతము.

దండకము:—శ్రీమన్మహా దేవదేవా! జగన్నాయకా! శుంభదండాండ పిండాండ వేధోండము ల్సేయుచున్ దున్మింపుచున్, గ్రాలు కాలక్రియా భాస్వరా! యంతకున్ హేతువై నీవ యెద్దానితో నంట కెట్లుందువో, బాపురే! యట్టి నీమాయ గుర్తింప బ్రహ్మాదులున్ శక్తులే గారనన్ మాదృశుల్ మానవు ల్శక్తులా? యైన మమ్ము న్నిరాధారతన్ ద్రోయరాకె ల్లెడన్ గర్మసూత్రంబుచేఁ బోషణం జేయుచా కర్మతోడం జరింపన్ స్వతంత్రంబు

నొక్కింతఁ గైసేసినావట్టి స్వాతంత్ర్యముం జక్క గుర్తించు
శక్తిఁ బ్రసాదింపవే.

వీ॥పా:—తండ్రీ! నీదివ్య కారుణ్యవీక్షా ప్రసారంబు లేక, స్మదీయాంత
రంగంబులన్ భక్తి రేకెత్తు టెట్లో కదా! తల్లియే బిడ్డకు న్నేర్ప
కుం దల్లిపై బిడ్డకున్ బ్రేమ జన్మించు నెబ్భంగి? తాయమ్మ
లన్ బిడ్డకందించి యాతాయము ల్వట్టు మాయంచు లాలించు
చున్ దల్లియే నేర్పుగన్ బ్రేముడిన్ నేర్పకున్నంత నవ్వారికిన్
మాతపై భక్తి ప్రాప్తించునా? కాన నీబిడ్డలైయున్న మాలోన
నీపై నిసర్గంపుభక్తిన్ బ్రసాదింపవే!

వీ॥భో:—నాయనా! నీవిచిత్రంపు మాయాతుషారంబు పైఁగ్రమ్మినన్
దాపసశ్రేణి యెక్కింతయేని న్నినుంజూడఁగానోపరో యయ్యా!
ధ్యానార్చనాద్యుల్గదన్ భక్తిమైసల్పువారిన్ బరీక్షించునట్లొ
క్కచోఁ జూడఁబ్రత్యక్షమౌచొ క్కచోఁగానరాకేఁగుచున్
గోపనక్రీడఁ గావింతువా, యాటలో నీదయాలేశముం జెందకే
జీవియైన న్నినుం జేరినిన్నట్టి గెల్వొందునే?

వీ॥పా:—మేము విద్యావశత్వంబునన్ నీసదుద్దేశ్యమే మాత్రముం గాంచ
లేకుండి, పల్మాఱు త్తుకోళ్వట్టుచో నొక్కవేళన్నినుం దిట్టుచున్నా
మయారే! కడుం జంచలంబైన మద్భక్తి యల్లాడుచున్, గర్మ
సూత్రమ్ముపై నమ్మకమ్ముంచనీదయ్యె, మాపోకలెల్లన్ మము
న్బాధ్యులంజేయునన్మాట విస్మారకంబయ్యె, నింకన్ విధిప్రేరితం
బంచు విభ్రాంతులన్ జిక్కుచున్నాము.

వీ॥భో:—లోకైకరక్షామణీ! నీవు నిత్యప్రసన్నుండవై మాహృదబ్జంబు
లందున్న భక్త్యంకురంబుల్ సదావృద్ధిఁగైసేసి, యాభక్తితో
మేము గావించునర్చావిధుల్మెచ్చి, మమ్మున్ గటాక్షింపరాకున్న
మాకేరుదిక్కైనవారు?

వీ॥పా:—ఓమహాతేజ! యజ్ఞానమన్ జీఁకటుల్గన్నులంగప్పి మెల్కొల్పిఁ
దప్పొప్పుల న్రొమ్మలఁగాన్పించు మాయాప్రపంచంబుపై వైచి,

నిర్ద్వంద్వమై, నిష్కలానందమై, మోక్షదంబై నెఱిన్ వెల్గునిన్నున్,
గనన్ లేకవాపోవుచున్ ప్రాకృతత్వంబునన్ సత్యరూపంబుఁ
గన్పెట్టఁగానేరకాలంబనంబేమియున్ లేక మిథ్యాస్వరూపాళి
వెన్నాడి పర్వెత్తుచున్, గష్టసౌఖ్యంబులన్ దోఁగుచున్నార
మిద్ధానబుద్ధుల్ వశంబేమిగాకున్నవి.

వీ|భో:—ఓదివ్యరూపా మమున్ ప్రేమమైఁజూచుచున్, మాకు నీడైన
మూర్తి ప్రసన్నంబుగాకున్న మేమింకగుర్తింపఁగానేర మాలంబ
నంబిచ్చి నంగాని, చేపట్టఁగాఁజాలమీవే యనంతానుకంపామతిన్
మమ్ముఁ జేపట్టుచుం ద్రిప్పుమా!

వీ|పా:—మాహృదబ్జంబులన్ గోర్కెలెల్లప్పుడున్ మోసులై ప్రాఁకు,
వానిన్ విమర్శింపఁగానేరమా, వాంఛలాతీఱ, వర్ష్మాత్వమున్
లేకయే యిచ్చలీడేరునా? భ్రాంతిమాకేల?

వీ|భో:—వీ|పా:—అయ్యా! భవద్దివ్య కారుణ్యవీక్షన్ గటాక్షించి,
మమ్మున్ గడుఁ బ్రోవవే! సచ్చిదానందరూపా! లసద్వేద
వేదాంత తత్వప్రదీపా! నమస్తే! నమస్తే!! నమస్తే!!! నమః.

(ధ్యానాయత్త చిత్తులై యొడలు మఱచియున్న వీరభోజాచార్య, వీరపాపమాంబలం
గాంచి యొక ఋషికుమారుఁ డటకు వచ్చును.)

ఋ|కు:—ఓహో! వీర లెవ్వరైయుందురు? సాధారణముగ నిట్టివారు
వచ్చుతావు గాదేయిది. వీరు సామాన్య నగరవాసులగు నరులఁ
బోలి యున్నారు. మునులు గారు. యోగులు గారు. వీరిట్లేల
కనులుమూసికొని కూర్చొని యుండిరి? నిద్రాయత్తులై యుం
దురో? ఇట్లుకూర్చుండి చాలకాలము నిద్రింపఁజాలరు. లంబికా
యోగమున హంసను బిగియఁబట్టి యుంచిరాయన నటులను
దోఁచుట లేను. ఒకవేళ మృతులైయుందురా? ముఖవికాస
ములు వేఱువిధమున సూచించుచున్నవి. పలుకరించి చూచె
దను. ఓస్త్రీపురుషులారా! మీరెవరు? పలుకరేమి? మీ
యూరెయ్యది? కదలింతునా? శపింతురేమో, వీరా, మము

బోంట్ల శపించునది? అయినను ధ్యానభంగ మొనర్చుట తప్పు. ఇటఁగూర్చుండి యొకింత వేచియుండెద.

(వీరభోజయాచార్యులు మెల్లన నేత్రములు విప్పును. కొంతవడికి వీరపాపయయుఁ గనులు తెఱచును.)

వీ॥భో:—సతీ! ధ్యానముచే నీమన ముల్లాసవంతమయ్యెనా?

వీ॥పా:—తాత్కాలికముగ శాంతి యొదవకుండునా? ఈశాంతి యెల్ల కాలము నిలిచిన మనమెంత యదృష్టవంతులమోకదా?

వీ॥భో:—అప్పుడు యోగిసత్తములమై పోదుము. మనసు సుడిగండ్ల వడుచు మనలను బాధింపదు. పొద్దెక్కుచున్నది. నీవలసి యున్నదానవు. రెండుదినములనుండి యాహారమే లభింపక పోయె. ఈవిపినమందు మార్గము గ్రాహ్యమగుటలేదు. దాఁపున ఋష్యాశ్రమములేమియునున్నజాడ గాన్పింపదు.

వీ॥పా:—ఇన్ని చెట్లున్నవి. తినుటకు యోగ్యమయిన ఫలమొక్కటియు దొరకుట లేదే! తినఁదగిన యాకులైనను లేవే!

వీ॥భో:—మనకేటులఁ దెలియును. ఉండియే యుండును. ఎవరేనిం దెలుపక గుర్తించుటెట్లు? ఎటు పోవుదము?

వీ॥పా:—నాకేమి తెలియును?

వీ॥భో:—దైవముపై భారమువైచి యీత్రోవలలో దేని ననుసరించు దమో చెప్పుము?

వీ॥పా:—మార్గాంతరము తోఁచనప్పుడం తియేగదా చేయునది — అల్లదిగో! ఆచెట్టుక్రింద నొక పురుషుఁడు గానవచ్చుచున్నాఁడు.

(అని ఋషికుమారునిఁ జూపును. అతఁడు కునికిపాట్లు పడుచుండ వీరభోజాచార్యుఁడు వానికడకేఁగును.)

వీ॥భో:—బాలకా! నీవెవరవు? ఋషికుమారుఁడవు గదా?

ఋ॥కు:—(ఉలికిపడి, కోపముతో) అయిన నేమి? మూడుదినముల నుండి నాకు రాత్రులయందు నిద్దుర లేదు. పగలు విశ్రాంతియు లేదు. ఆశ్రమమునుండి దూరముగ వచ్చి యొకింత నేదఁ

దీర్చికొనుచుండ నీవేల తొందర గలిగించితివి ? ఎందుకుఁ బిలుతువు ?

వీ॥భో:——నాయనా! క్షమింపుము. నేనా యుద్దేశ్యముతోఁ బిలువలేను.

ఋ॥కు:——నీయుద్దేశ్యము నాకెందులకు ? నన్ను బీడింపకుము. అలసి యున్నాను.

వీ॥భో:——కారణమేమై యుండును ?

ఋ॥కు:——నీకెందుకయ్యా?— మూడు దినములనుండి కొందఱతిథులు మాయాశ్రమముననుండి, యీ తెల్లవారుజాముననే వెడలిరి. వారి కుపచర్యలు చేయుటతో విశ్రాంతి చిక్కక యలసితిని— చెప్పినది చాలునా ?

వీ॥భో:——పాపము నీవాఁకలి గొనియుందువు. ఆఁకలి కోపకారణము.

(అచ్చటకు వీరపాపమాంబయు వచ్చును.)

వీ॥పా:——ఋషికుమారుఁడే లోకో కోపించుచున్నాఁడు.

ఋ॥కు:——నాకుఁ గోపమున్నదని నీకెవరు తెలిపిరి? నేను పిలిచినప్పుడు పలుకక నిద్రించుచుంటివి. ఆనిద్రలోఁగలఁగంటివి కాఁబోలు. వనములలో మునివృత్తి నుండు మాకుఁ గ్రోధముండుననఁ దగునా?మీరలెవరు?

వీ॥భో:——మేము యాత్రికులము. ఈదాఁపున నేవేని ఋష్యాశ్రమము లున్నవేమో తెలుపుదువా? మీయాశ్రమమునకుఁ ద్రోవయేది?

ఋ॥కు:——మీరును మాయాశ్రమునకే వత్తురా?

వీ॥పా:——మేము మీకేవిధమగు తొందరయును గల్పింపము. భయ పడకుము.

ఋ॥కు:——మహాభీకరాటవులలోఁ దిరుగుచు భయంకర ఘాతుకమృగ ములకు వెఱవము గాని, మీకు వెఱవవలయును గాఁబోలు. ఏమి చక్కఁగ నోదార్చుచుంటివమ్మా!

వీ॥భో:——క్షమింపుము నాయనా! నీకంత యాగ్రహమేల?

ఋ॥కు:—అదిగో! మరల నటులనే వచింతురే? ఆపె నాకుఁ గోపము నారోపించినది. నీవాగ్రహము నారోపించుచున్నావు. మీరు చాల చెడ్డవారువలె నున్నారు.

వీ॥పా:—ఋషికుమారకా! శాంతింపుము. అకారణముగ దూషించు వేల?

ఋ॥కు:—అల్లదిగో! నేనక్కడకుఁ దాపపడినట్లును, మీరు నన్ను శాంతింపఁ జేయునట్లునా? పైఁగా నేను దూషించితి నంటిరా? నిష్కారణముగఁ గూడనా? ఇవి త్రాగుఁబోతుల కూతలు.

వీ॥భో:—పుణ్యవనవాసులు జనావాసములందువలె గజిబిజిలేక, ప్రశాంతులరై నెమ్మది నుందురని వింటిమి. మీయిప్పటికి స్థితి కేదియో గొప్పహేతువుండి యుండవలయును. మీయెడ మే మపచారములు చేయఁజూడము స్వామీ!

ఋ॥కు:—ఇఁక నేనా యపచారములఁజేయునది? వహ్వా! ఏటిమాటలు? నేను గడుపునొప్పితోఁ బడెడు బాధ మీకుఁ దెలియదా?

వీ॥పా:—అటులనా? పాపము! ఆవిషయము మాకెట్లు దెలియును?

ఋ॥కు:—మొగముఁజూచినఁ దెలియదా ఆర్తుఁడనైయున్నాఁడనని?

వీ॥భో:—చెప్పకయే తెలిసికొనశక్తి చాలదు గదానాయనా! క్షమింపు మంటిమి గదా, మమ్మేటు పొమ్మందువో కొంచెము చెప్పుము!

ఋ॥కు:—నేనిక్కడ నుంటినని చెప్పరుగదా? మా యాశ్రమమునకుఁ ద్రోవఁ దెల్పెదను.

వీ॥పా:—మాకేమిపని నాయనా?

ఋ॥కు:—తెలిపితిరా; నన్నిప్పుడే మాగురువుగారు పిలిపింతురు. ఆపని మాత్రము చేయుఁడు మీ పుణ్యము!

వీ॥భో:—అనవసరముగ మేమేమియుఁ జెప్పువారము గాము. మమ్మెట్లు పొమ్మందువో తెలియఁజేయుము.

ఋ॥కు:—అదిగో! అట్లే, కుడిచేతిమీఁదుగాఁ బొండు.

వీ॥పా:—ఎంతదూరము పోవలసి యుండును?

ఋ॥కు:—అదిగో, ఆవిమర్శనములన్నియు నెందుకు ? ఎంతదూరమో నడువఁజాలరా ?

వీ॥పా:—నిజము. అలసియున్నారము.

ఋ॥కు:—ఎట్లున్నను నడువక తీరునా ? మనపై జాలిచెంది యాశ్రమ మెదురునడచి వచ్చునా ?

వీ॥భో:—పోనిండు ; ఎటులనో మనోధైర్యము వహించి నడక సాఁగింతుము.

ఋ॥కు:—పొండు. పొండు. దూరము హెచ్చదు తగ్గదు.

వీ భో; వీ॥పా:—పోయివత్తుము, నమస్కారములు స్వామీ !

(నిష్క్రమింతురు)

ఋ॥కు:—అబ్బా! భుక్తాయాసము శత్రువునకైనను వలదురా! బాబూ !! పొద్దున వెడలుచున్న యతిథునకుఁ గొన్నిపండ్లు నిచ్చి పంపుమని గురుఁడాజ్ఞ నీయఁగనే ఆయదను గనిపట్టి, పదిపండ్లను బొట్టనిండ మెక్కితి. అతిథిసత్కారములకై సేకరించినవాని నెల్ల మూఁడునాళ్ళనుండి వెనుకాడక మెసవుచుంటిని. చేసిన కర్మకు ఫలమనుభవింపక తీరదందురు; ఇదియే కదా నిదర్శనము. నారాయణ నామపఠనముచేఁ దరించినవారిని నేనెఱుంగుదును. అట్లుండ నేనందుచేఁ దరింపకున్నను గోపముననైనఁ గృశింపఁజేసి కొనఁజాలకుందునా? ప్రయత్నముఁ జేసిచూచెదఁ గాక. నారాయణ, నారాయణ, నారాయణ, నారాయణా!

(తెరపడును)

---

## మూఁడవ రంగము.

(అత్రిముని యాశ్రమము—అత్రిఋషి చెట్టునీడను గూర్చుండియుండ, వీరభోజాచార్యులును, వీరపాపమాంబయుఁ, బ్రవేశింతురు)

వీ॥భో, వీ॥పా:—మునితల్లజా ! నమస్కారములు.

అత్రి:—ఇష్టావాప్తిరస్తు ! కూర్చుండుఁడు. మీర లెవ్వరు ?

వీ॥భో:—ఋషిసత్తమా! మాయది పోతులూరు గ్రామము. నాపేరు వీరభోజాచార్యులు. ఈపె నా సతి, వీరపాపమాంబిక యను నామమునంబరగు. మేము విశ్వకర్మవంశపు బ్రాహ్మణులము.

అత్రి:—సంతోషము! మీనిలయ మిచ్చటికిం గడుదూరమై యుండ నోపు. ఏకతమున వచ్చియుండిరి ?

వీ॥భో:—మీదర్శనార్థమై వచ్చియుంటిమి. సాధుదర్శనము సర్వవిధ ముల శుభప్రద మండ్రు. మిమ్ముం గాంచగల్గితిమి. మా కోర్కులు ఫలించినట్లే.

అత్రి:—అన్నింటికిని గర్మయె మూలము. ప్రాప్తమున్న సకలమును జేకూరును.

వీ॥పా:—సాధుసందర్శన మాహాత్మ్యమున సకలవాంఛితార్థసిద్ధి కాంగలదని యార్యప్రవచన ముండుంగాదె !

వీ॥భో:—ఆ సాధుదర్శనమే ప్రాప్తకారణమని యోచవలయును. ప్రాప్తములేనిదే మహాత్ముల నవలోకించుటయు, వారిం బూజించుభాగ్యము ననుభవించుటయుం గల్గునా ?

అత్రి:—మీరెంతకాలమునుండి సంచారము సేయుచున్నారు ?

వీ॥భో:—తాపసేంద్రా! ఈతడవ యిల్లువిడిచి మూఁడుమాసము లైనది. దేవతామందిరములను, పుణ్యతీర్థములను, పావన ఋష్యాశ్రమ ములను, సంసేవించుచు వచ్చుచున్నాము. ఇట్లనేకపర్యాయ ములు యాత్రలు సలిపియున్నారము.

అత్రి:—అట్లనా ? ఎందులకు ?

వీ॥భో:—తండ్రీ! నీకడ దాఁపనేల ? సంతానహీనులమై కుందికుంది, మహాత్ములనర్చింప సంతానముగాంచుపుణ్యము లభించుఁగదా యని తిరుగాడుచున్నాము. పుణ్యక్షేత్రములనేకము సేవించి యుంటిమి.

అత్రి:—మీభక్తి మాననీయము. భగవంతుఁ డనుగ్రహించుఁగాక !

వీ॥భో:—తండ్రీ! చిరకాలమునుండి భగవంతుఁడు మాభక్తిని బరిశోధించుచున్నాఁడు.

వీ॥పా:—వాని కనుగ్రహము వొడము టెన్నటికో గదా.

అత్రి:—అమ్మా! తొందర వలదు. భక్తిసేయుటే మనవంతుగాని, ఫలము నెప్పుడు బడయునది నిర్ణయించునది మనముగాదు. భక్తి సల్పుచో అనన్యమనస్కులమై యానలినాక్షుని సేవింప వలయునేగాని, ఆసమయమున మనసంకల్పమునుగొంత కొంటవడఁజేసి దానిఫలముపైకిఁ ద్రిప్పందగదు. భక్తికిభక్తియే ఫలము సుఁడీ!

వీ॥భో:—అట్టి యనన్యభక్తి గృహవ్రతుల కలవియగునా తండ్రీ?

అత్రి:—ఇంకెవరి కలవియగునని మీతలంపు?

వీ॥భో:—వనవాసులకును, యతివరులకును, సాధ్యముకానోపు. వారలు లౌకికబంధమున కతీతులు గదా! వారి కేయాసలు నుండవు. చిత్తము ప్రశాంతముగ నుండును.

అత్రి:—వారును సర్వమున కతీతులై యుండిరని తలఁపకుఁడు. ఇంతకుఁ దీవ్రనిష్ఠ ప్రధానము.

వీ॥పా:—నిష్ఠకుఁ దగిన వాతావరణము మిముబోంట్లకు మిగుల నను కూలముగా నుండును గదా తండ్రీ!

అత్రి:—అవును. వాతావరణ మున్నను, చిత్తసంస్కారమున్నఁగాని ఫలింపదని చెప్పితిని. జనకుఁడు, భీష్ముఁడు, మున్నగువారు గృహస్థులుగను, బ్రహ్మచారులుగను నుండిరి. మహానివరులకు ధర్మోపదేశములఁ జేయఁ జాలిరి. ప్రహ్లాదుఁడు, ధ్రువుఁడు మొదలగు బాలకులు ఋషులను మించినవారే.

వీ॥భో:—ఉత్తరోత్తరా శ్రమములు శ్రేష్ఠతరములే గదా?

అత్రి:—సామాన్యస్థితియందు సంఘమున నీయవస్థ లొకదానితరు వాత నొకటిగాఁ గాలక్రమమునరావలసి యుండును. కాని పూర్వపరిపాకదశగలవారు కాలనియమమునకుఁ గట్టువడి యుండ

నవసరము లేదు. మఱియు నేయాశ్రమము నుండియైనను మోక్షముసాధింపనగును.

తే॥గీ॥ ఆశ్రమంబులు, గులముల ♦ నన్యమోక్ష
మభిలషించెడువారికి ♦ సడ్డురావు;
ఒకటి హెచ్చేమి? లొచ్చవే ♦ యొకటి యేమి?
అమలనిష్ఠకు నెల్లఁ బా ♦ దయి తనర్పు;

మఱియు,

తే॥గీ॥ ఉత్తమజ్ఞానసంసిద్ధి ♦ యొదవు నంత
లొచ్చుకులమైనఁ ♦ బూజింత్రు హెచ్చువారు;
అవనిసురులల్లరామకృ ♦ ష్ణాఖ్యులను భ
జింపరే! వ్యాధుకడ విద్యఁ ♦ జెప్పికొనరె?

ఇంతియే కాక,

తే॥గీ అలఘుభక్తుఁ డార్యేతరుఁ ♦ డయిన నతని
నిచ్చఁ బూజింప వెనుదీయ ♦ రెల్లవారు;
మ్లేచ్ఛులగువారు భక్తులై ♦ మెలఁగుచున్న
వారికిని వశ్యుఁడగు భగ ♦ వానుఁడెపుడు!

వీ॥భో:—చిత్తము. అట్టియున్నతభావములు జనసామాన్యమునకును బామరులకును, బట్టవు.

అత్రి:—తథ్యము. ఉన్నతభావములుగల విజ్ఞులయాదర్శములనే మన మవలంబింపవలసి యుండును. అట్టిశక్తిగాని పూనికగాని లేని సామాన్యులు, వ్యావహారిక ధర్మములగు వర్ణాశ్రమములను బాటింప వలసినదే.

చం॥ కలితపు సంస్క్రియాబలము ♦ గల్గనినాఁడె కులాశ్రమ వ్యవ
స్థలపస, వానినాపయిఁ బ్ర ♦ శంసయొనర్ప నయోగ్యమౌసుఁడీ!
మొలకగునప్డు కంచెలస ♦ మున్నతిఁ గోరు; నదంత భూరుహం
బలవికి ఖ్యాతిఁ బొందవ♦నయ్యవి త్యాజ్యము లే గదా యగున్

వీ|భో:—అవ్యాజభక్తి దుర్లభము. పామరులముగాన గ్రామ్యభక్తియే చేయుచుంటివనుట నిజము. మాపై భగవానున కనుగ్రహ మెన్నటికేని గల్గునో, కలుగదో;

అత్రి:—మీభక్తి సాంద్రతరము గావలయును. భగవన్నామ ముచ్చరించునప్పుడును, సర్వేశ్వరుని దివ్యస్వరూపము మనమునఁ బొడమినపుడును, తన్మయత ననుభవింపవలయును. వర్తకుని తోడ బేరమాడుచు, "నేనింతసొమ్మునిత్తును నీ వెంతసరకు నిత్తువు?" అనునటుల భగవానునకు భక్తొసఁగి, ప్రతిఫలముగా వరములఁ దెమ్మని తగవులాడునటుల వర్తించుట, భక్తుని కుచితముగాదు.

వీ|పా:—అనన్యభక్తితో నారాయణు నర్చించుచున్నవారికిఁ బుత్రులు లేకున్నను, నరక ముండదుగదా తండ్రీ ?

అత్రి:—అటువంటివారికి నరకముండక పోవుటేగాక, పుణ్యలోకము లన్నియు వారియధీన మందే యుండును. ఇంతేల ?

సీ|| ఇహమెల్ల నెఱిఁగియు ♦ నెఱుఁగనిగతి నున్న
జడభరతుని మోక్ష ♦ చరిత వినవె ?
అనవద్య భక్తిమై ♦ నధికశక్తిని గొన్న
యాంజనేయుఁడు మోక్ష ♦ మందికొనఁడె?
జనన మాదిగ బ్రహ్మ♦చర్యవ్రతము గొన్న
గంగాత్మజునకుమో ♦ క్షంబుకలదె ?
వెన్నాడుతండ్రి ♦ భావింపనేరకచన్న
శుకయోగి మోక్షంబుఁ ♦ జూరఁగొనఁడే ?

తే||గీ|| వీరి కనపత్యదోషంబు ♦ వెడలి పోదె ?
ఆ'యపుత్రునకగతియే, ♦ యనెడు నుడువు,
స్వస్వరూపానుసంధులౌ ♦ జ్ఞాన భక్తి
పరుల నేవేళ బాధింపఁ ♦ దరియఁ గలదె ?

వీ॥భో:—మేము వృద్ధులమగుటచేత నేత్రకోరికలు మెండై తపించుచుంటిమే గాని, దేవరవారు సెలవిచ్చిన విషయమంతయు సత్యము. ముమ్మాటికి సత్యము, సత్యము, సత్యము.

(వీరనాయణుండను బాలుడు; పుడకలతోఁ జేసిన రథము నొకదానిని బట్టుకొని ప్రవేశించును)

వీర:—తాతా ! ఇదిగో నా రథము జూచితివా ?

అత్రి:—నాయనా ! దాని నెవరు రచించి యిచ్చినారు ?

వీర:—నా కొకరు చేసిపెట్టవలయునా ? నేనే దీనిని జేసితిని.

అత్రి:—చాల బాగుగ నున్నది. దీనిలో నెవరిని గూర్చుండఁబెట్టుదువు?

వీర:—నేనేకూర్చుందును. తాతా ! నిన్నుకూడా ఎక్కనిత్తులే.

అత్రి:—మృత్తికతోఁ జక్రములను, పుడకలతోఁ జట్టములను ఎంత జక్కఁగాఁ గూర్చితివోయి !

వీ॥పా:—పూలతో ముచ్చటగా నలంకరించినాఁడు. నాయనా! ఇటు రమ్ము. దాని నొకసారి నన్ను జూడనిమ్ము.

వీర:—అమ్మా ! ఇదిగో, తాకకుండ చూడుము.

వీ॥పా:—(బాలుని ముద్దాడుచు) నన్నుగన్నతండ్రీ ! ఎంత చమత్కృతితో రథము రచించినాడవోయి! నీవు పుడమిపై నవతరించిన యీ దేవశిల్పివలె నున్నావు.

వీర:— నేను దేవశిల్పినేగాను. సమస్త దేవతలను, సకలలోకాలను, ఈబొజ్జలో ధరించి ఉన్నానట! నారాయణుడనే నేనట! తాత గారంటారు.

వీ॥భో:—మునితిలకా ! ఈబాలుఁ డెవఁడు ?

అత్రి:—వానిచరిత్రమతి గోప్యము. ఎవరికిని దెలియరానిది. వాని వలననే నేనొకింత దెలిసికొంటిని. ఈతనికిఁ దలిదండ్రులు భువిలో లేరు.

వీ॥భో:—కట్టా ! ఇట్టి చిన్నతనముననే తలిదండ్రులు కఱవయిరా ?

వీర:—నాకు చిన్నతనమేమిటి ? నాకు జనకులే లేరు. ఇప్పుడు కఱవు కావడమా ? అదెట్లు ?

వీ॥పా:—(ముద్దాడి) నాచిన్నియన్నా! నీ ముద్దుపెంపుమాటలమృత మును గురియుచున్నవోయి! ఈ పలుకు లెట్లునేర్చితివో!
అత్రి:—వీరనారాయణా! నీవృత్తాంతము వీరికిఁ దెలుపుదునా?
వీర:—అది రహస్యంగా?
అత్రి:—మిత్రులారా! వీనిచరిత్ర మతిచిత్రము. లోకమునకు మన వలన వెల్లడి కాఁదగినది కాదు. భక్తాగ్రేసరులగుటచేత మీకుఁ దెలుపు కుతూహలము నాకు జనించినది. దీనికిని గారణముండ నోపు. మీరు రహస్యముఁ గాపాడుదురా?
వీ॥పా:—మీయాజ్ఞ నుల్లంఘింతుమా?
వీ॥భో:—మీయుత్తరువు నతిక్రమించువారము గాము.
వీర:—తాతా! చెప్పు నీకు చేతనైతే!
అత్రి:—నీవలనఁ దెలిసినమట్టుకే నీగుట్టు తెలిసినది. నాకుఁదెలిసిన మట్టుకే దెల్పెదను.
వీర:—సరి!
అత్రి:—మిత్రులారా! ఈరహస్యమును మీరెందును బహిరంగపఱుప కుఁడు.

సీ॥ తలిదండ్రు లెవ్వరో ♦ తెలియకుండ స్వయంభు
వైననాఁడీ చిన్ని ♦ యర్భకుండు,
మూఁడు మూర్తులయంశ ♦ ముల నభిన్నతఁ దాల్చి
లీలమై వచ్చెనీ ♦ బాలకుండు,
ఎల్ల సత్యమతంబు ♦ లిచ్ఛమై స్వప్రభా
వమున వెల్గించు నీ ♦ వన్నెకాఁడు,
కడు భిన్నగతి గతిఁ ♦ గానని వెడఁగుల
చిక్కుఁడలించు నీ ♦ చిఱుతప్రోడ,

ఆ॥వె॥ సన్నచేత బ్రహ్మ ♦ సర్గంబు నడిపించి,
విష్ణునంశ దాని ♦ వెలయఁజేసి,
రుద్రవృత్తి లోక ♦ రూఢిమై నెఱవేర్ప
జెన్నులెన్నొ చూపు ♦ చున్న వాఁడు;

వీ॥పా:—చిత్తము. రహస్యముగనే యుంచెదము.

వీ॥భో:—అట్లనే గోప్యముగ నుంతుము.

వీర:—మీరు దాచేదేమిటి?

(వీరపాపమవు వీరభోజాచార్య లిరువురు చెప్పినదంతయు మఱతురు)

వీ॥భో:—ఋషివరా! ఏమి చెప్పుచుంటిరి? ఈబాలకుండెవఁడు?

వీ॥పా—చిత్రముగనున్నది! ఋషి తెల్పిన చరిత్రాంశమొక్కటియు జ్ఞప్తిలేదే—మునితిలకా! ఈబుడుతఁ డేకులమువాఁడు? ఎవరు వీనిజనకులు? మీశిష్యవర్గమున నెప్పుడు చేరె?

అత్రి:—ఈతఁడు రథకారుఁడై యొప్పును. లేనిజనకుల ప్రశంస యేల? మూఁడు వత్సరములనాఁడు నాకడకు వచ్చెను. నేను నేర్పినది లేదు, అతఁడు నేర్చినదిలేదు. నాకడనుండువటువులలో నొకఁడై యుంటకతనికఁగలకుతూహలలీలచే నింత కాలమిచట నిలిచినాఁడు.

వీర:—నేనిక్కడుండే జెన్నాళ్లూ?

అత్రి:—మఱచితిని. వచ్చిననాఁడు మూఁడు వత్సరము లిక్కడ నుందు నని తెలిపినాఁడు—నాయనా! వీరనారాయణా! నీవు నాకడనే నిలుతుననుము. ఎటకేఁగుదువు? నీయెడబాటున కోర్వఁగలనా?

వీర:—సంయోగ వియోగములచే గుందకుండునాడు గదా జన్మము ధన్యమగును ? నేనువెడలక నీకు మది దిట్టపడదు. ఇష్టానిష్ట ముల రెంటితోడను పెనగులాడక యొపదును స్థితప్రజ్ఞుడు గాడు.

వీ॥పా:—సంతానములేని శోకాగ్నిచేఁ దపించుచున్నారము. ఇక్కడ నుండవేని మాకడనుండ నోడఁబడుము. నీసేవఁజేయుభాగ్యము మాకనుగ్రహింపుము.

వీర:—మునుపు లేనిశోకాగ్నికి పరితపించు మీరు వియోగాగ్నిని భరింతురా ?

వీ॥భో:—అదేమి పుత్రా ! అటులాడెదవు ?

వీర:—నేనెవరికడను చిరకాలము నిలిచెడువాడను కాను.

వీ॥పా:—నీసంగాత మెంతకాలము ప్రాప్తించినను ఆనందమే.

అత్రి:—నేనేమనవలయునో నోరాడకున్నది.

వీర:—ఏమీ అనవద్దు నన్ను వీరితో పంపుము.

వీ॥భో:—ధన్యోస్మి.

అత్రి:—నాయధీనమున నున్నచో—

వీర:—స్థితప్రజ్ఞుడవై నిలువుము.

వీ॥పా:—మునీంద్రా! అనుగ్రహింపుము! బాలకుఁడు సమ్మతించుచున్నాఁడు.

వీ॥భో:—ఋషితిలకా! పుత్రార్థులమై మీకడకు వచ్చితిమి. మఱవకుఁడు. సంతసమునఁ గృతార్థులఁ జేయుఁడు.

అత్రి:—నాచేతనగుచో వెనుకాడుదునా?

వీ॥భో:—స్థిత ప్రజ్ఞులరు.

వీర:—ఎంతో అభ్యాసమున్న మీరే ఇటు తొట్రుపడుటా? అదికూడ కన్నకొమరుని గూర్చికాదే! ఇక సామాన్య సంసారులగతి యేమి? వారికి మీరు మార్గము చూపవలె గదా? తాతా! సందేహ పడకుము.

అత్రి:—గీ. ఏమి యీవింత! మది జనియించు నెల్ల
తలఁపులును నీయధీనమై దనరుచుండె;
ఆత్మశక్తి యఁటన్న రవ్వంత యేని
యుపకరించుట లేదు నీయొద్దఁ గుఱ్ఱ!

మిత్రులారా! వీనిని మీకు దత్తునిజేయవలయునా?

వీ॥భో:—తథాస్తు! దత్తాత్రేయుఁడే యితఁడు మాకు.

వీ॥పా:—నా నోములపంట. నాముద్దు కుఱ్ఱఁడు.

అత్రి:—అంతయుఁ జిత్రనాటకము వోలె నున్నది. ఈమె యప్పుడే నాకుఱ్ఱఁడు, నాబిడ్డఁడనుచున్నదే!

వీర:—"అగుగాక" అనుము.

అత్రి:—(చేతులు పైకెత్తి) తథాస్తు!— మిత్రులారా! దేవపూజకు వేళ యైనది. ఆపర్ణశాలకుఁ బోదము. (తెర వ్రాలును.)

ఇది ప్రథమాంకము.

# బ్రహ్మానందలీలలు

## ద్వితీయాంకము

### మొదటి రంగము.

(బనగానపల్లె-గజిమిరెడ్డి వెంకటరెడ్డియు, అచ్చమాంబయుఁ బ్రవేశింతురు)

అచ్చ:—తెల్లవారుజామునుండియు పేడ పోగేస్తున్నాను. సగంపని కాలేదు. కమతగాండిక రారన్నమాటేగా?

వెంక:—ఇంకే మొస్తారు? నబాబుగారిదగ్గఱ కుదిరినారంట. కొత్తవాళ్ళను చూచుకోవాలి. వాళ్ళనే గింజలెక్కువిస్తామని పిలువనా?

అచ్చ:—వాళ్ళకు మనం గింజలు తక్కువ జేశామా? అందరికంటె ఎక్కువేగా మనమిచ్చేది?

వెంక:—అందుకనే వీళ్ళెక్కడబోతారని, బయంలేకుండా ఉన్నాం. నబాబుగారైనా ఎక్కువగింజలియ్యడు. గింజలాసపెడితే మళ్ళీ వస్తారేమో?

అచ్చ:—వాళ్ళకి నబాబుగారి కమతగాళ్ళనిపించుకోవాలని బులపాటం పుట్టింది. మనమేం చేస్తాం?

వెంక:—గింజ లెక్కువిస్తామని ఆశ పెట్టేదా?

అచ్చ:—వద్దు, వద్దు. ఈపోటీలతో పోట్లాట లొస్తాయి. మనమెంత మోతుపరులమైనా, నబాబుగారికి లోకువేగదా?

వెంక:—అందుకే నేను జడుస్తున్నాను. మనకెట్లా గడుస్తుందో తెలియదు. ఏంచేయడానికి తోచడం లేదు.

అచ్చ:—ఏదెట్లయినా నబాబుగారితో విరోధం రాకుండా చూడండి.

వెంక:—రామిసెట్టి కమతగాళ్ళిద్దరు వస్తామంటున్నారు. పదికుంచాల గింజలెక్కువియ్యమంటారు.

అచ్చ:—పదికుంచాలెక్కువిస్తే మనకు పొయ్యేదేంది? కాని సెట్టిగారికి మాత్రం యిబ్బంది గాదూ? మనం సెట్టిగారి కన్యాయం చేస్తే, ఆయనింకొకరి కన్యాయం చేస్తాడు. వాళ్ళింకోరి కన్యాయం చెయ్యాలి పోస్తుంది. గందరగోళాలు కలుగుతాయి. ఇదివర కిట్లాంటి అల్లర్లు లేవు.

వెంక:—నిజమే. ఇవ్వాళ నేనే గొడ్లదొలుకు పోతాను. ఏవ్వారివా త్తైనా కుదురుతాదేమో చూడాలి.

అచ్చ:—ఇయ్యాలింతదాక పూజెయ్యనే లేదు. మీరైనా పూడ్దీసుక పోయి, కొంచెం పూజేసి పొండి. మామూలుయాళ దాట్ట గైనా తప్పింది.

వెంక:—ఆపూజలో నీకున్నంత ఉత్సాహం నాకులేదు. నేనూరికే కీర్తన్లు పాడుకోటమే గాని, పూజలు చేతామని మనస్సులేదు.

అచ్చ:—ఎట్లాగో ఈరోజు మీరుచేసిపొండి!

వెంక:—నీవొక్కదానవూ ఈపనంతా చెయ్యగలవూ?

అచ్చ:—పొద్దెక్కుతుందిగాని పనిగాకపోతుందా? మీరెళ్ళండి.

వేంక:—లేగదూడ లరుస్తున్నయి. పాలు దీసి పోతాను.

అచ్చ:—అట్టాచూడండి! ఎవరో కుఱ్ఱోడొస్తున్నాడు. ఏవ్వారోడో?

(వీరప్ప ప్రవేశించును)

వేంక:—అబ్బాయీ? మీదేవూరు?

వీర:—మాది పోతులూరు.

వేంక:—నీపేరేమిటి?

వీర:—వీరనారాయణ—వీరప్ప, అంటరు.

అచ్చ:—అంటే? రెండు పేర్లా?

వీర:—మొదట నాపేరు వీరనారాయణ. తరువాత మాయమ్మ వీరప్ప యని ముద్దుపేరుబెట్టి పిలిచెడిది. అదే వాడుక పడినది.

వేంక:—మీరెవరు?

వీర:—నన్ను విశ్వబ్రాహ్మణ దంపతులు పెంచుచుండెడి వారు.

వేంక:—ఇప్పుడు లేరా వారు ?

వీర:—వారు గతించినారు.

వేంక:—పెంచుతుండేవారంటే యేమిటి? నీతలిదండ్రులు గారూ ?

వీర:—నాకుఁ దలిదండ్రులు లేరు. పెంపుడువారుండిరి. నాలుగేండ్లు పెంచినారు. వారు గతించినారు. నేనిప్పు డేకాకినే.

అచ్చ:—నిన్ను చూస్తే జాలవుతుంది. ఆమాటలో దేంది? అన్నమా?

వీర:—కాదు, నాదుప్పటి.

అచ్చ:—(వేంకటరెడ్డితో) మీరెళ్ళి తొరగా పాలీయండి. కాసిని పాల్తాగి పోతాడు—. బాబూ ! నీవెక్కడికి పోతావు ?

వీర:—ఇక్కడికే వచ్చినాను. మీకడకే.

అచ్చ:—ఆయన పాలిత్తాడు గాని, తాగు. పొద్దెక్కుతుంది. (మగనితో) మళ్ళీ ఆయన పోతాడు—మీరు పొండి. (వేంకటరెడ్డి వెడలును)

వీర:—నేను కొంచెము పేడదీసి సాయపడుదును.

అచ్చ:—సరిసరి! ఇట్టొచ్చినోడిచేత పని చేయిస్తామా? అవసరమైతే ఉందిగాని.

వీర:—ఏమీ! ఇట్టే వచ్చినవానికి మీరు పాలీయఁబోవుట లేదా?

అచ్చ:—అయితే, పాలిచ్చి పనిచేయించుకుంటామా? బదులా?

వీర:—బదులే మున్నది? పెద్దదానవు నీవొక్కతవే కష్టపడుచుండ చిన్నవాఁడను చూచుచునూరకుండరాదు.

అచ్చ:—ఓయి నాయనో! ఎంత నీతిమంతుండవు. ఈకాలంలో ఇట్టాటి సత్తెమంతు లున్నారు కామట్టే లోకం నిలిసింది సుమా! బాబూ! నీవు పేడతీయద్దు. తప్పు.

వీర:—ఏమియుఁ దప్పు లేదు. నీవు పెద్దదానవు తీయుటలేదా?

అచ్చ:—నేను సూద్రదాన్ని. మాకీపని తప్పు లేదు. ఇశబ్బామ్మలీపని మాకు జేయరాదు.

వీర:—వారైనను దమ ఇండ్లకడఁ జేసికొనరా?

అచ్చ:—ఆళ్లిం కోచోట చేయరాదు.

వీర:—నేను నీదగ్గఱ నుండవలెనని వచ్చినాను.

అచ్చ:—ఉండు తండ్రీ! నీయిష్టమొచ్చినన్నాళ్లుండు.

వీర:—అటులనే. ఏమియుఁ బని చేయక యెట్లుండవచ్చును?

అచ్చ:—ఏంపనీచెయ్యక్కర్లేదు. నీవుంటేనే చాలు. రోజూ పొద్దున్నే నీమొగంజూస్తే చాలును! పున్నెమొస్తుంది. చందమామంటి మొగం!

వీర:— నాకంటె అందమైనవారు న్నారు.

అచ్చ:—అందమో, చందమో, వరాలమూటలంటి నీమాటలే చాలు.

వీర:—నాకంటెఁ జక్కని కబుర్లు చెప్పువారు న్నారు;

అచ్చ:—ఉంటే ఉండనీ మాకెట్లొస్తారు?

వీర:—నీదాతృత్వమే పిలుచుకొని వచ్చును.

అచ్చ:—నాదేముంది? అంతా దేవుడిదే. మేమల్లా వాడి సేవకులం.

వీర:—సరే! నాకేమియుఁ బని చెప్పనిచో నేఁబోయెదను.

అచ్చ:—ఉండుండు నాయనా! నిన్ను చూచిన్నాల్నుండి దేవుణ్ని చూచినట్టుంది. అంత ఆనందంగా ఉంది.

వీర:—ప్రేమ యుండినచో నట్లే కాన్పించును.

అచ్చ:—అందుకేగా నిన్నుండమనేది! ఎల్తా నంటావేం ?

వీర:—పని చెప్పకున్న వెళ్ళ కేమి చేయుదును ?

అచ్చ:—నాయనా! నామాట విను. నీవేమీ పనిచెయ్యక్కర్లేదు. ఉండు.

వీర:—ఊరకేమాత్ర ముండను. పని చేయించుకొనుము.

అచ్చ:—నీవు యిశ్వబ్రాహ్మలబ్బాయినంటివిగా ?

వీర:—అవును.

అచ్చ:—అట్టయితే వడ్రంగం చేస్తావా ? కమ్మరం చేస్తావా ? ఏం చేస్తావు ?

వీర:—అవేవియు నేర్వలేను.

అచ్చ:—నేర్పిస్తాము, నేర్చుకుంటావా ?

వీర:—ఆపనులు నాకు వద్దు.

అచ్చ:—పోనీ, ఊరికేనే ఉండు. ఇశ్శబ్బాబుమ్మలింటోనే అన్నం పెట్టిత్తాను. మాయింటికాడుండు.

వీర:—ఉండను. నాకిష్టమైన పని చేయనిండు.

అచ్చ:—ఏంపని చేస్తావు?

వీర:—మీపశువులను గాచెదను.

అచ్చ:—అబ్బే ! నీకది తగినపని గాదు.

వీర:—ఏమీ ? గోపాలకృష్ణమూర్తి పసువుల గాచినాఁడు కాదూ ? తెలియదా ?

అచ్చ:—అవును. కాసినాడు. ఆయన గొల్లోడుగా.

వీర:—కాఁడు, గొల్లవాఁడు కాఁడు. క్షత్రియుఁడు గదా ?

అచ్చ:—గొల్లవాడల్లే ఉన్నాడుగా, అప్పుడు కాసేడు.

వీర:—అప్పుడు గాచిన ఇప్పుడు కాయఁగూడదా?

అచ్చ—ఇప్పుడేడీ కృష్ణుడు?

వీర:—ఇక్కడనే యున్నాఁడు.

అచ్చ:—యాడ?

వీర:—నేనే!

అచ్చ:—నీవా? అంతటి మాయలవాడివలెనే ఉన్నావు!

వీర:—మాయలేనిది పుట్టుటెట్లు? మాయలోఁ బడకుండ ఎవరును పుట్టరు.

అచ్చ:—నీ మాటలు నాకర్దము కావు. నీవు కృష్ణుడవా ఎట్లా ?

వీర:—నీవూ నేనూ, ఎన్నోసార్లు పుట్టినాము. మనకిదియే మొదటి జన్మకాదు. చివరిదీకాదు.

అచ్చ—అయితే ?

వీర:—నేనే మునుపు కృష్ణుఁడనఁట!

అచ్చు:—ఎట్లా?

వీర:—తెలిసినవాండ్రు చెప్పుమాట.

అచ్చు:—ఓరా తెలిసినోళ్లు? ఈగొడవ నాకు తెలియదు. అదుగో రెడ్డి గారు పాలు తెత్తుండాడు. పోయి తాగు.

(వెంకటరెడ్డి పాలు తెచ్చి యీయ వీరప్ప త్రాగును)

వెంక:—ఇంకా కాసిని కావాలా?

వీర:—అబ్బో! చాలును. ఏమనెదరు? ఉండు మందురా? వెళ్ళిపొమ్మం దురా?

అచ్చు:—ఉండు నాయనా! నిన్ను పొమ్మంటానికి నోరొస్తుందీ?

వీర:—ఊరకనే యుండువాఁడఁ గానని, చెప్పియుంటిని గదా.

వెంక:—ఏమి చేస్తావు?

అచ్చు:—పేడ దీస్తానం టాడు.

వెంక:—అబ్బే! అబ్బే! ఏంపనయ్యా?

వీర:—పనులలో మంచిచెడ్డలు నీతినిబట్టి యుండును గాని, చేయి మురికగుటను బట్టి కాదు.

అచ్చు:—నీకు వడ్రింగం నేర్పిస్తాము, ఉండు.

వీర:—సుఖముగా పిల్లనగ్రోవినూఁదికొనుచు గోవులఁ గాచెదను. లేకున్న నాదారినే పోవుదును.

వేంక:—ఎన్ని పసువుల్ని కాస్తావు ?

వీర:—ఎన్నైనా సరే.

అచ్చు:—అబ్బో ! ఈ పాపడిమాటలు ! నవ్వొత్తుంది.

వేంక:—మాకు వందలాది గొడ్లున్నయి. నీవొక్కడవే కాస్తావు ?

వీర:—ఆ :

వేంక:—ఇవ్వాల్టికి సూడావుల్ని, పాడావుల్ని, తోలుకుపో చూస్తాము. ఆటిల్లో లేగదూడ తల్లులున్నయి. జాగర్తగా ఉంటావా ?

వీర:—ఊరకే చెప్పిన లాభమేమి ?

వేంక:—నేను ఇయ్యాళ తూర్పుపొలం పోవాలి. గొడ్లు జాగర్త!

అచ్చు:—గొడ్లని బీటిదాక తోలి పోండి. ఈ బుడుతఁడు కాస్తాడు.

వీర:—మఱేమియు భయము లేదు.

అచ్చ:—అయితే అన్నమో? ఆమాట మఱిచే పోయాం. ఇసబ్బామ్మ లింటో ఒండిత్తే పనికొత్తుందిగా ?

వీర:—నా కన్న మక్కఱలేదు. పాలు చాలును.

అచ్చ:—ముప్పొద్దులూనా?

వీర:—రెండుసార్లు చాలును.

వేంక—ఎన్ని పాలని తాగి ఉంటావు ?

వీర:—మీరిచ్చినన్నియే చాలును.

అచ్చ:—పాలు కూడా కడుపునిండా ఇయ్యమనుకున్నావా యేంటి ?

వేంక:—ఇయ్యాలిటికి చూచి తరువాత మాట్లాడుదాములే. రా, ఆపుల్నిప్పు చూతాము.

అచ్చ:—మద్దెన్నపేళ ఆకలయితేనే పాలుపితుక్కుతాగు. ఉపాస ముండబోకు. ఇదిగో చెంబు.

వీర—నాకుపవాసముల భయము లేదు. పోదమురండు.

(తెర వ్రాలును)

## రెండవ రంగము.

(బీడునందొక విశాల ప్రదేశము. రాముడు, గోవిందుడు, సూరారెడ్డి, బసనారెడ్డి, మున్నగు గోవులం గాచు బాలకులు ప్రవేశింతురు.)

రాము:—నేనెంతో బతిమాలేను. ఈరప్ప రానన్నాడు.

గోవిం:—పడేసి ఈడ్చుకు రాకపోయినావు ?

సూరా:—ఓరాయన ?

బస:—ఆడే, యెంకరెడ్డింటికి కొత్తగొచ్చేడు. ఆళ్ళ కమతగాళ్ళంతా నబాబోరి కమతంలోకి పోయారుగా. ఈడే పసుల్ని మేపుతా నని రెడ్డిగారి దగ్గర చేరాడు.

సూరా:—ఎన్నాళ్ళయింది ?

రాము:—మొన్న మొన్నే.

బసవా:—అయిదారు నెల్లయిందిలే. చూరారెడ్డి తాతగారింటికోగానే వొచ్చాడు.

గోవిం:—ఒరెవ్! ఆడికి చాలా పొగరుందిరా!

రాము:—నిజానికి పొగరుండి మన్నేం చేశాడు ?

గోవిం:—ఆటుకోటానికి రమ్మంటే రాడేం ? ఇన్నాల్నుంచి వొక్క నాడేనా వొచ్చాడా? మనం చాలాసార్లు పిల్చాం, బతిమాలాం.

సూరా:— కొత్తోడు గందాని, పోట్లాడేరు కామాల్ను. ఆడికిబయ మెత్తుండాలి.

రాము:—ఓరూ పోట్లాళ్లా? గోయిందుడే కలిపిచ్చుకు పోట్లాడ లన్నా, ఈరప్ప తప్పించుకు పోతాడు.

బస:—లోపల పొగరుందిగాని పైకి పిల్లికి మల్లే ఉంటాడు. యెంకట్రెడ్డి కమతగాడని ఊరుకుంటున్నారు.

రాము:—ఆడు పోట్లాటకు రాందేంచేత్తారో? అయినా మన్ని తిట్టేడా? తిమ్మాడా?

గోవిం:—ఈరాముడేచెడగొట్టాడు. మొన్న నుడేస్కుండే వాణ్నే.

రాము:—ఎందుకమ్మా?

గోవిం:—మొన్న ఆట్టానికిరమ్మంటే మాట్టాడకోతున్నాడు.

బస:—ఒక పొగరుమాటైనా ఒత్తుందేమో. పడేసి బాద్దామంటే, తల్లీ ముండా మొయ్యా పిల్లల్లే పోతాడ్రా!

సూరా:—పిరికోడు గామాల్ను.

రాము:—పిరికోడూ? రోజూ ఆకారడవుల్లో దూరి పోతాడు. ఒక నాడు మేమంతా ఎంబడబడ్డాం. రమ్మన్నాడు. ఆడు పొదల్లో దూరిపోతున్నాడు. మాకందరికి బయమెత్తింది. పాణాలు గుప్పిట్లో పట్టుకొని ఎనక్కొచ్చాం.

గోవిం:—ఎంతలావు అడవుల్లోకైనా పోతాడు. శింగం అంటే జంకడు. పులంటే గొంకడు! ఆమాటనిజం. తల్లిముండ మొయ్యా నే నంటే జంకుతాడు.

బస:—అన్నాయంగా కొడతావని బయం.

సూరా:—ఎకుర్ధిరిగితే నిన్నుకొట్టలేమా? ఎంకట్రెడ్డితో చెపుతా డేమో? ఆడి జోలి మనకెందుకూ?

గోవిం:—ఆడిమొగంలే నన్నాసి. అట్టాటితెలివి లేదు.

సూరా:—ఇప్పుడెక్కడి కోయాడూ?

బస:—ఆ అడవుల్లో దూరిపోయాడు.

సూరా:— ఆ బండమీద గొడ్డోల్లెరా?

గోవిం:—అయ్యో యెంకట్రెడ్డిగారియ్యి. యీరప్ప కాశేయే.

సూరా:—అట్టా వొదిలేసి పోతే అయ్యిట్టట్టు చెదిరి పోవూ? మఱి పులేసికెత్తే యేంసేత్తాడూ.

బస:—అడమ్రట్టం! నెలరోజుల్నాడు మామందలో దూన్నేసికెళ్లింది. ఆడిమందజోలికి పులీరాదు, తోడేలూరాదు!

రాము:—ఆమంద బండదిగి రావు. ఒక్క పరకైనా మెయ్యవు. తల్లిముండ మొయ్యా, ఆవుకు పదేశ్శేర్లు పాలిత్తయ్యంట. మేత మెయ్యందే నెమరేస్తైరా ఆడిగొడ్లు.

సూరా:—ఇంటికాడ మేతేస్తారా ఏంటి? గడ్డితినకుండా పాలిత్తయ్యా? అయి బండదిగెందుకు రావూ?

రాము:—ఆటెని బండమీందికి తోల్తాడు. చుట్టూ కఱ్ఱతో గీత గీత్తాడు. చచ్చినా అయి గీద్దాటి రావు.

బస:—అదీ చిత్తరం! యెంకట్రెడ్డితో జెప్తే నమ్మడూ?

గోవిం:—అచ్చమ్మ సాడీల్నెపుతుండామని యెకురు కోప్పడ్డది.

సూరా:—ఇయ్యాల్నే నెల్లి చెప్తా.

రాము:—ఈగోలేంది? ఈరప్ప మన్నేం కొట్టేడా? తిట్టేడా? ఎందుకు ఇంతకసి?

గోవిం:—పిలిత్తే రాడనేకోపం. అంతకంటే యేంలేదు. అయినా రోజూ అడవుల్లో దూరి ఏంచేత్తాడో? మాయగా వుంది.

సూరా:—మనమాడుకోటాని కెల్దాం పదండి—అరేరే! మాకోడిదూళ్లు కుమ్ములాడుకుంటున్నైరా బాబూ!

(అని సూరారెడ్డి పరుగెత్తుకపోవును.)

గోవిం:—ఆ వొచ్చేదోరో య్?

బస:—మాగొడ్లన్నీ అట్టట్టా దూరంగా పోయాయి తోలుకురావాలి. రాముడూ! వొత్తావ్? (వెడలును.)

(వేంకటరెడ్డియు నచ్చమాంబయుఁ బ్రవేశింతురు.)

వేంక:—గోయిందా! మాగొడ్లేడుండేది?

రాము:—అయిగో! ఆబండ మీాద.

అచ్చ:—(దృష్టి నిగుడించి చూచి) చక్కగా నెమరేస్తూ పండుకొన్నాయి. కొంచెంసేపు మేపొయినాడా?

గోవిం:—మేపడం కూడానా? మీాదొడ్డొదిత్తే, ఆటికి ఆబండమీాద కైదే;

వేంక:—కైదుకేముంది? బండచుట్టూ కంచుందా?

రాము:—ఆటిచుట్టూ కఱ్ఱతోగీత్తాడు. అంతే! మేము తోలమోయినా కదలవు!! ఈరప్పొత్తే గీతకాల్తో కాత్త తుడుత్తాడు. గొడ్లు బయటికొత్తయి; మొన్నగాలోనలో కూడా అయి గీతదాటి రాలేదుగా?

అచ్చ:—ఆనాడు మాత్రం, తడిసి పోయినియ్యా? లేదుగా?

వేంక:—ఈరప్ప నెట్టాగైనా తీసెయ్యాలి. అందఱితో యిరోదాలేగా, అందుకైనా తీసెయ్యాలి.

అచ్చ:—రాముడూ! ఈరప్ప మీాతో పోట్టాడ్తాడూ?

రాము:—లేదు గాని, పిలిస్తే కల్సిరాడు.

వేంక:—అట్టయితే మీారేంది? రోజూ ఆడిమీాద చెప్పేది ?

గోవిం:—గొడ్లను మేపడనే;

వేంక:—అట్టా పోయి చూద్దాం రండి. ఈరప్ప పొయ్యే దారి సూపండి.

రాము:—అబ్బో! అచ్చమ్మ కూడొత్తుందా? కీకారణ్నెం! బయంకరం. పుల్లో, సింగాలో, వోరెళతారు లోనికి ?

అచ్చ:—ఈరప్ప వొక్కడే పోతే, మనమంతా పోలేం ?

గోవిం:—పోదాం రండి. పెద్దోళ్ళు న్నారు.

(అందఱు నిష్క్రమింతురు.)

## మూడవ రంగము.

(కొండగుహలో నేకాగ్రచిత్తుడై వీరప్ప వ్రాయుచుండును; వేంకటరెడ్డి అచ్చమాంబయు దూరమునుండి ప్రవేశింతురు.)

వేంక:—కారడవిలో ఈగట్లు, ఈగుట్టలు, ఈపొదలు, ఈ ముండ్లతిప్పలు, దాటిదాటి, పాణం రోసింది. నీవు కాస్తైనా కట్టాని కోర్చనిదానవు. ఎందుకీ తిప్పలు ?

అచ్చ:—నిజం కనుక్కోటానికి. చెప్పుడుమాటలు చేటు తెస్తాయి. ఈరప్పమీద ఓళ్లెన్ని చెప్పినా, దోసం చూపినోళ్లు లేరు. మనకేం నట్టంకనిపించలా.

వేంక:—ఇంకా అయినా తిరిగిపోదాం పద.

అచ్చ:—ఏమైనట్టు ? ఈరప్పరాస్యం తెలుసుకోంది మననుమానం తీరదుగా. తీరని సందేగం పెద్దదెయ్యం.

వేంక:—ఇంకా ముందుకోయి, ఆపొద దాటిపోయి, ఆగుట్టచాటున చూద్దాం. అక్కడ కన్పించకపోతే ఇంటిదోవ పట్టడమే.

అచ్చ:—సరే కాని, ఇంటిదోవ తెలుస్తుందా ? ఎట్టొట్టొచ్చామో తెలియడంలా. నయమే, ఆపిల్లల్ని వొదిలొచ్చేం. ఆళ్లు తిట్టి పోసేవోరు. నాకాళ్ళన్నీ పుళ్లే! గుడ్డలన్నీ చీరికలై పోయినై. ఒళ్ళంతా గీచుకొని పోయింది. ఇంటికి నడిచెల్లగలమో లేదో?

వేంక:—సగందూరానే మెనక్కెల్దామంటే యిన్నావు కావు. ఈ రాత్తిరి దోవ తెలియకపోతే యేపులో నోట్లో యేసుకుంటుంది మన్ని.

అచ్చ:—రాసిపెట్టుంటే తప్పుతుందా? అన్నిటికీ ఆ శీమన్నారాయుడే వుండాడు పదండి. పొద్దు లేదు.

వెంక:—నేనేనడవలేకున్నా. నీవెట్లా వొస్తావో జాగర్త! దోవ జారుడుగావుంది. కాలు తొలిగిందా చచ్చామే.

అచ్చ:—అట్టా చూడండి. ఆ యెలుగేంది?

వేంక:—ఎక్కడ? ఆ చీకటి గుయ్యారంలోనా? యెలుగెక్కడ?

అచ్చ:—ఇట్టా రండి! ఈవంకగా తొంగి చూడండి.

వేంక:—అవునే, యెల్తురే! యెల్తురే!!

అచ్చ:—ఇక్కడెల్తూరెక్కడిది? నాగేంద్రుడుపాము లుంటయ్యానీ, ఆటి తల్లో మాణిక్కాలుంటయ్యానీ, అయి యెలుగుతుంటయ్యానీ, అంటారు! ఇది పాములుండే గువేమో?

వేంక:—దాపునకు పోయినకొద్దీ యెలుగు పెద్దదవుతుంది.అదొక గుహల్లే వుంది.

అచ్చ:—నాకు బయమేస్తుంది. ఎవరైనా రుసులున్నారేమో? శపిస్తారేమో?

వేంక:—ఏమో యేమి రానున్నదో! ఏమైనాసరే దర్శనం చేద్దాం.

అచ్చ:—నిండుబక్తితో పోదాం. ఆపైన నారాయణుడున్నాడు.

(ఘుందుకుం బోదురు)

ఆహాహా! ఏమి యీయెలుగు! కండ్లు మిఱువోపుచున్నయి. ఆకూర్చున్న దెవరు?

వేంక:—బ్రమ్మలోకానికొచ్చామల్లావుంది! ఏంటో సుష్టి చేత్తావుండాడు.

అచ్చ:—(రహస్యముగా) బ్రమ్మ గాదు. శివుడల్లే వుంది. కాదు కాదు!

వేంక:—యిష్టుమూర్తే! అయిగో శంకుచక్రాలు.

అచ్చ:—ఏయి ఏయి? ఆఁ! ఆఁ! అవును:—ఏయి? ఏయి?

వేంక:—ఇప్పుడు కానరావడం లేదు.

అచ్చ:—చూపు మారిపోతోంది. వోరో రుసి.

వేంక:—నాకు బయం తగ్గుతుంది. యెదటికి పోదాం.

అచ్చ:—పదండి.

వేంక:—మళ్లీ బయంగా ఉంది. కాళ్ళొ నుకుతున్నయి పడ్తానేమో.

అచ్చ:— ముందు ఆతిమీాద కాలేయండి. కలత పడకండి.

(కొంతసేపు నోట మాటరాక నివ్వెఱపోయి చూతురు. వీరప్పను గుర్తింతురు.)

వేంక:—దండాలు. మానుబావా! దండాలు.

అచ్చ:—మన్నించాలి. చమించాలి. (సాష్టాంగపడుచుండు.)

( వీరప్ప సవినయముగ లేచి ఆశ్చర్యము నభినయించును. )

వీర:—లెండు, లెండు. మహనీయులారా ! మీరేల యిటు వచ్చితిరి ? ఎట్లు రాఁగలిగిరి ? కడు శ్రమపడి యుండవలయును. ఈ సేవకునికొఱకై, అయ్యో ! ఎంతటి బాధల ననుభవించితిరి ? కఠిన శిలల నధిగమించుచు, కంటకములపై నడచుచు, పొదల దూరుచు, భీకరక్రూర వన్యమృగముల నెలవులకు మీరు రాఁగ తంటెయ్యది? ఇది నరసంచారమునకు యోగ్యమగు తావుగాదే! మాటాడరేల ? నాకొఱకై వచ్చితిరేని, మిమ్ము రప్పించిన యపరాధమును మన్నింపుఁడు !

అచ్చ:—స్వామీ ! భయంచేత ఒడలువణకిపోతున్నది. కళ్ళు బయర్లు కమ్ముచున్నయి. నిలువలేను. కూర్చుంటాను, చమించాలి.

వేంక:—దయ చూపాలి. నాస్థితి కూడా అట్లాగే ఉంది.

వీర:—చిత్తము నిలకడఁజేయుఁడు. నేను మీసేవకుఁడ వీరప్పను.

అచ్చ:— పంచచామరము:—

"పరాత్పరా, చిరంతనప్రభా ప్రసారభాసురా !
చరాచరప్రపంచ జంతుజాతగర్భ విస్తరా !
నిరంతర ప్రసన్నలోక నిర్వికార దుర్భరా !
స్థిరుండవైననిన్ను సన్నుతింతునో కృపాకరా !"

"అనంతశక్తి సంయుతుండవైన నీ మహత్త్వముల్
గనుంగొనన్ సురేశుఁడే తగండనంగమాదృశుల్
మనుష్యమాత్రు లెంతవారు, మాపయిన్ గృపారసం
బనన్యరీతి నిల్పినాఁడవౌఁగదా జగత్పతీ !"

"అణీయమందణుండవై, మహత్తులో మహత్తువై,
ఘృణిప్రకాండ మండకోటికిన్ బొనర్తువౌ; మనో
మణిప్రభా ప్రభాసమాన మాననీయమూర్తి నిన్
గణింప నాకుశక్యమా? జగజ్జనైక లోలుపా !"

"అహర్నిశంబు నీసుకీర్తు♦లాడి యాడి తృప్తినిం
వహింప లేక మొత్తమంది ♦ భక్తు లెన్ని జన్మలో
గ్రహించుచుం బ్రమోదతీర్థ♦రాశి మున్గి, మోక్షముం
విహాయితం బొనర్తు, రెట్టి♦వేడ్కయో! మహామయా!"

"మముద్ధరింపఁ జేయ రాదె? ♦ మౌనిలోక ముఖ్య ని
త్యముందపించి వేడఁజూడ్కి♦కందరాని దివ్యరూ
పముం బ్రసన్నమిచ్చితౌ, య♦పారమోద మయ్యె; మా
నమస్కృతుల్ గ్రహింపుమా య♦నంతకాంతి దంతురా!"

వేంక:—దేవా!

మ॥ ఉడివోనట్టివ్రతమ్ములం, దపములం, ♦ యోగమ్ములం, దాంటివా
నుడులం, బూజల, నింకనన్యముల, నె♦న్నోయేండ్లు కష్టించియుం,
గడకావంతయు నీయనుగ్రహము నం♦దంజాలకున్నారు; మా
యెడ నీప్రేమ మదెంతపొడ్డదియొ! తం♦డ్రీ !! దర్శనంబిచ్చితే;

మత్తకోకిల:—నీవ బ్రహ్మవు, నీవ విష్ణువు, ♦ నీవ శూలధరుండవుం,
నీవ దీప్యదజాండకోటుల ♦ నిర్వహింతువు పొట్టలో;
నీవు లోనధరించువారికి ♦ నీ వెలుంగును జూపెదౌ;
నీ విలాసమెఱుంగనెవ్వరు ♦ నేర్తు? దైవశిఖామణీ!

వీర:—మాననీయులారా! ఏమి యీధోరణి?

అచ్చు:—స్వామీ! మాకును గ్రాహ్యమగుట లేదు. మేము పలుకున దేమో మేమెఱుంగము. ఎట్టిభాష మానోటఁ బ్రవహించుచుం డెనో తెలియదు!

వేంక:—భగవంతా! ఇయ్యది నీమహిమయే. త్రిమూర్తుల నీలోన ధరించి, సమస్తశక్తులను నీలోనుండి ప్రసరము గావించు ప్రోడా! నీకేమి పేరర్హమగునో, ఎట్లు నిన్ను సంబోధించుటో, తెలియ రాకున్నది. ఎదుటఁ బ్రత్యక్షముగ నవలోకించుచున్నను, నిన్నుఁ దెలియ రాకున్నాము. చూచుచును నీస్వరూపము గ్రహింపఁ జాలకున్నాము. నాఁడు మాటలురాని పసిబాలుఁడౌ ధ్రువునిచేఁ

జత్రోక్తులఁ బల్కరించిన మహనీయుఁడవు గావా? నీవెవ్వండవో కరుణించి తెల్పుము తండ్రీ!

వీర:—భక్తుల కధీనుండనై, పెక్కగు మూర్తుల ధరించుచుందు నేనె వ్వాఁడనని తెల్పుదును! ఏభక్తుఁలు నన్నెట్లు భావించిన నేనట్టి వాఁడనే యగుదును. త్రిమూర్త్యాత్మకమగు మాయారూప మును మీరిప్పు డీలీలఁగాంచుచున్నారు. మూడు జన్మలనుం డియు నీయచ్చమాంబిక నాకు భక్తురాలై, నన్ను సేవించు చున్నది. కారణాంతరములచేత నేనీ నరరూపమును ధరించి యుండ నాలీలలు సాఁగించుటకై యజమానులు గావలసి వచ్చిరి. ఈపుణ్యవతి నాకు మిగుల సంసేవ్యురాలై యొప్పినది. తత్కారణముచేత నీవును సంసేవ్యుఁడ వైతివి. వేంకటరెడ్డీ! సీభార్యకతమున నీవు ధన్యుఁడ వైతివి.

అచ్చ:—స్వామీ! నీచే నీచసేవలఁ జేయించిన మామహాపాపమెట్లు తీరును. ఈతనువులను బావకున కాహుతి చేసిపావనులము కాఁగలుగుదుమా?

వీర:—ఎంతటి వెఱ్ఱి! నాకు సంసేవ్యమూర్తులరైన మీరు పవిత్రులు, మిమ్మాపావకుఁడుగాదు గదా, ముక్కోటి నిలింపులును పవిత్రులఁ జేయఁజాలరు. తేజమునకుఁ గాంతినొసఁగువాఁ డెవఁడు? ఇఁక నా యీలీలావతారముసంగతి చెప్పెద వినుఁడు. నేను నాయనాది మహాప్రభావముచేత నరావతార ముఁ దాల్చి వీరనారాయణాఖ్యను బాలరూపమున నత్రిముని కడఁ జేరితిని. అతిముదముతోడ నాతఁడు నన్ను బెంచుచుండెను. "పోతులూరున" వీరపాపమ వీరభోజాచార్యులను పుణ్యదంప తులు, తీర్థసంసేవనముఁ జేయుచు, అత్రిమున్యాశ్రమమునకు వచ్చిరి. పుత్రార్థులై తిరుగాడుచున్న వారు నన్నా యాశ్రమ మునఁ గాంచి నాపై మక్కువ వహించి, అత్రిమునియనుమతి వడసి, నను దత్తు తీసికొనిరి. అందుచేత నాకు, దత్తాత్రేయుఁ డను, నామంబు గలిగినది. తదుపరి నాదత్తజనకులు వీరప్ప

యను ముద్దుపేరిడి పిలువ సాగిరి. వారు దివంగతులుకావుట నేనా పేరున దేశాటనముం గావించుచు, మీచెంతం గొలువు గాంటిని. ఇంకముందు జరుగంబోవు లీలలు అతిరహస్యములు యుక్తకాలమున మీకుం దెలియందగినంత దెలియంబఱతును.

వేంక:—స్వామీ! మీరు రచించు నాగ్రంథ మెయ్యది?

వీర:—అడిగితివా దీనిసంగతి? ఇది దేవరహస్యము. కాలజ్ఞానమను గ్రంథము. లోకముయొక్క, ముఖ్యముగా హైందవభూమి యొక్కభవిష్యత్తు, దీనియందు లిఖించుచున్నాండను.

అచ్చ:—అందలి విషయములు మేమొకింత వినందగునే?

వీర:—వలదు. దీనిని లోకమునం బ్రచారముసేయు నర్హతంగలవ్యక్తి వేఱుగ నున్నాండు. ఉచితసమయ మేతెంచునప్పుడు వానికి దీనిని వినిపింతును. అతండిందలి యంశములం గొన్నిటిం బ్రకటించును. మూలగ్రంథము మాత్రము మీగ్రామమున భూస్థాపితమై యుండంగలదు. భక్తులారా! మీకేమిగావలయునో కోరుండు.

అచ్చ:—సీ॥ సనకాది మౌనీంద్ర ♦ సంసేవ్యుండౌ నిన్ను
గొల్చుభాగ్యంబు చే♦కూరె మాకు,

వేంక:— 2 తొలిపల్కుగములు సం♦స్తుతి యొనర్చెడునిన్ను
బొగడునదృష్టంబు ♦ బొసంగె మాకు,

అచ్చ:— 3 నిర్వికల్పసమాధి ♦ నే, గాంచునీరూపుం
బ్రత్యక్షముగం జూచు ♦ భాగ్య మబ్బె,

వేంక:— 4 ఉగ్రతపఃప్రభా ♦ వోద్ధతి మాకును
నీతోడ భాషించు ♦ నియతి గల్గె,

అచ్చ:—గీ॥ భక్తవత్సల! నీదివ్య ♦ పరమకరుణ
వలనంగాకెట్లు మాకు సం♦భవము లివ్వి?

అచ్చ, వెంక:—ఓదయాసింధు! మాకు నీ♦యూడిగములె
యెపుడొదవునట్లు పేర్మి దీ♦వింపు మయ్య!

వీర:—అట్లే యగుంగాక!

వేంక:— మమ్మిట్లనుగ్రహించిన దేవరవారికేమి యర్పింతుము?

వీర:—మీ విశ్వాసమును, శ్రద్ధా భక్తి భావములును; ఇంకేమర్పింపఁ గలరు? నాకేమి కావలయును? సరి! ఇక మీయథాస్థితిని బడయుఁడు. రహస్యముల వెలువరింప నెంచకుఁడు. మీరు యజమానులు. నేను సేవకుఁడను. ఈనాటకమిటుల నడువ వలసినదే! తెలిసినదా? మారాడకుఁడు. పోదము రండు.

(తెర వ్రాలును)

## నాల్గవ రంగము

(అచ్చమాంబ యిల్లు. అచ్చమాంబయు, రాముడు, గోవిందరెడ్డి, ప్రవేశింతురు.)

గోవిం:—ఈరప్ప యాడకెల్లేడో తెలసిందంట్రా?

రాము:—ఎవరికి తెల్సు?

గోవిం:—అచ్చమ్మావాళ్లు గుహలోకెళ్ళి చూశారుగదా, ఏమయిందో అక్కడ?

రాము:—అగుట్టు మనకేం దెలియదు. ఆడకెళ్ళొచ్చినకాణ్ణుండీ అచ్చమ్మా మొకటిరెడ్డీ, మత్తే, మారిపొయ్యారు. ఇన్నాల్టికంటే దేముడి పూజలెక్కువగా చేస్తున్నారు.

గోవిం:—అసలు ఈరప్ప, అచ్చమ్మోళ్ళకేందో బోదిచ్చాడనుకుంటున్నారంతా. అప్పట్నుండే యిట్టా మారిపొయ్యారు. ఒరేయ్! నిజమేందో అచ్చమ్మ నడుగుదాం?

రాము:—అమ్మా! నీమడుకుతనం ఆమెదగ్గర చూపబాకు. అదుగో! అచ్చమ్మొత్తుంది. అరవమాకు.

(అచ్చమ్మ ప్రవేశించును)

అచ్చ:— రెడ్డిగారేమన్నా కనపడ్డారా గోయిందా?

గోవిం:—నాకాపళ్లా. సరేగాని యీరప్పేడకెల్లాడు?

అచ్చ:— తెలవనేలేదుగా నాయనా.

రాము:—మీరిచారించారా?

అచ్చు:—లేదు.

గోవిం:—గుహాలో కనపడ్డాడుగందా, ఆడేంసేత్తుండాడు?

అచ్చు:—కూచొని వుండాడు.

గోవిం:—మీకేంచెప్పాడు? మీరేం అడిగారు?

అచ్చు:—ఆగొడవంతా ఇప్పుడెందుకు నాయనా? బంగారమంటిబిడ్డడు మొడబాసి పోయాడు.

రాము:—ఎతికించరాదూ?

అచ్చు:—ఎక్కడెతికిస్తాం?

గోవిం:—నబాబుగారికి చెపితే ఎతికిత్తారు.

రాము:—ఏంనేరం జేశాడని? అట్టాంటాళ్ళనైతే దొరతనంవోరు మెతికి పట్టుకుంటారు.

గోవిం:—నేరాలకేం, పసుల్ని తిన్నగా కాయాలా ? యాడకోపోయి దాక్కునే వోడు. చెప్పకుండా కమతం విడిచి పాఱిపోయాడు.

అచ్చు:—మీమాటలు చూస్తే మొంతమంచివోళ్ళకైనా యిరోదు లుంటారన్నమాట వొట్టిది కాదని తెలుస్తావుంది.

గోవిం:—నేనన్నమాటల్లో అబద్దా లున్నయ్యా ?

రాము:—కావల్సి నన్ని.

గోవిం:—ఏవి ? చెప్పు. పసుల్ని తిన్నగ్గాసాడా ?

అచ్చు:—కాసేడో లేదో, మాపసువులు-మాత్రం బాగావుండయి. చాలా ఎక్కువైయ్యాయి. నాలెట్టు పాలిత్తుండయి!

గోవిం:—పాఱిపోయి దాక్కునేవోడు కాడూ ?

రాము:—పాఱిపోడం యేంటీ ? దాక్కోటం యేంటి ? దొంగతనం జేసాడా ? అట్టా అనరాదు.

గోవిం:—చెప్పకుండా కమతం ఇడవచ్చా ?

రాము:—ఆమాట అచ్చమ్మ నడుగు ?

అచ్చు:— చెప్పే యెల్లేడు. వద్దుండంటుంటె యెల్లాడని రెడ్డిగారికి కోపం.

గోవిం:—అది నేరంకాదా?

రాము:—ఇట్టం లేనివోడుం డాలా? నిన్నోడయినా ఉండంటే ఉంటావా? కబుర్లు సెప్తాడు.

గోవిం:—నా కెందుకూ యీగోడు. మీాకోపం వొత్తుంది. ఎల్లేటప్పుడు సద్దెన్నమైనా తీసికెల్లేడా?

అచ్చు:—సద్దెన్నం లేదు, ఏడెన్నం లేదు. ఉన్నన్నాళ్లు అన్నం దిన్నాడా?

గోనీం:—ఏంటీ? అన్నం దిన్లా?

అచ్చు:—లేదు.

గోవిం:—మతేం దిన్నాడు?

అచ్చు:—పాలు తాగేవోడు. ఎప్పుడైనా పళ్లు తినేవోడు.

రాము:—అంతేనా?

అచ్చు:—అంతే.

రాము:—ఆచ్చరియం.

గోవిం:—ఆచ్చరియం యేందిలే. పాలు తాగాడు చాల్దా?

అచ్చు:—అయైనా మేము బలంతం సేత్తే కాసిం దాగేవాడు.

రాము:—మీాకు లాబమైన కమతగాడే!

అచ్చు:—కమతగాడల్లే వున్నాడా? కడుపునబుట్టిన బిడ్డైనా అంత యిస్సాసంగా వుండుడు. మాామంచోడు, దేముడు.

గోవిం:—ఆడిదగ్గిర మయిమ లున్నయ్యంటారు నిజమేనా ?

అచ్చు:—చెప్పడాని కీల్లేదు.

రాము:—బండమీాద గొడ్డు పండుకొని నిలిసుంటే సూళ్ళా ?

గోవిం:—అవునామాట నిజం.

రాము:—అతడు మళ్ళీ వొత్తే కమతం పెట్టుకుంటారా ?

గోవిం:—ఇంకానా? సిగ్గు లేకనా ?

అచ్చు:—అట్టాంటా వేంది? రాముడునోటివాక్యాన మాాయీారప్ప మళ్లీ వొత్తే కమతంలో పెట్టుకోం దేముడల్లే పూజేత్తాం.

గోవిం:—నీయిట్టం. గొడ్లకు పాలుదీసే యాలయింది. పోవాలి.

(నిష్క్రమించును)

రాము:—ఈడికి ఈరప్పమీాదన్యాయంగా కోపం.

అచ్చు:—ఎందుకనీ ?

రాము:—ఆటల్లోకీ పాటల్లోకీ రాలేదనే.

అచ్చు:—ఎప్పుడైనా పోట్లాడే వాడా ?

రాము:—ఎన్నడు లేదు. తిట్టినా వూరికునేవోడు. కొన్నాళ్ళు చెవిటోడనుకున్నాం కూడాను.

(తెరవాలును)

ఇది ద్వితీయాంకము.

---

# బ్రహ్మానందలీలలు

## తృతీయాంకము

### మొదటి రంగము.

(పెదకొమెర్ల గ్రామమునందు ఒక ఉద్యానవనమున, గోవిందమ్మ, కృష్ణవేణి, కమల, ప్రవేశింతురు.)

కృష్ణ:—గోవిందా! ఏమే బుట్టలో పూలు సగమైనను నిండలేదు. పూజాసమయము సమీపించుటలేదా? ఆపరధ్యాన మేమిటి?

కమ:—మాటాడవేమి? దీనికేదో పూనినట్లున్నది. తండ్రియనుచునే యున్నాఁడు. గోవిందా! గోవిందా! నీదేమైనా పోయిందా?

కృష్ణ:—అదేమి తులువతనమే కమలా? అటుల విరసముగ మాటాడుచున్నావు? నీకు పూనినదేమో.

కమ:—నీవెప్పుడును గోవిందపక్షమే వహించుట, అందఱకుఁ దెలిసినదే. ఈనాఁడు క్రొత్తయేమున్నది? నీసహవాసముచేతనే గోవింద సగము చెడుచున్నది. దాని తండ్రికూడఁ జెప్పుచునే యున్నాఁడు.

కృష్ణ:—ఈ నిష్ఠురములేల? నేను పోయెదను. ప్రొద్దున లేచినది మొదలు ఈపోరాటము లెందుకు?

గోవిం:—కృష్ణా ! పోకుము. ఇంతమాత్రాననే చకితవయ్యెదవేమి ? కల్లకపటము లెఱుఁగని కమలవాచాలత క్రొత్తదియా ?

కృష్ణ:—నీవేల పలుకకవైతివి ?

గోవిం:—నాకొక కల వచ్చినది.

కమ:—నిలిచియుండియే కలఁ గంటివి కాఁబోలు? కండ్లు తెఱచుకొనియేయున్నవి. చేతిలోని బుట్ట చేతిలోనె యున్నది.

గోవిం:—ఇప్పుడు కాదే. కడచిన రాత్రి.
కమ:— ఆకల యేదో చెప్పుము.
గోవిం:—నేనీ తోఁటలోఁ బూలు కోయుచున్నాను. ఆకస్మికముగ నిందొక దేవళము గాన్పించినది. దానిలో రాధాకృష్ణ విగ్రహములు దేదీప్యమానముగ వెలుఁగుచున్నవి. నేను వానిని బూజించుచున్నాను. ఎట్లు మాఱెనో తెలియదు. ఆవిగ్రహము అయిదు ముఖములుగల బ్రహ్మగా రూపాంతర మందినది.
కృష్ణ:—కలలోఁ గన్నవానికిఁ గ్రోవ తెన్నులు గలవా ?
కమ:—బ్రహ్మ కయిదవ ముఖము తగిలించినదేమే యీగోవిందమ్మ?
కృష్ణ:—ఈమె కల్పించినదేమున్నది ?
కమ:—కల యంతయు నామె మనఃకల్పితము గాదా? కలలను గల్పించునది, వానిని చూచునది, మనమేయని తాతగారందఱికిఁ జెప్పుచుండ వినలేదా ? కాని మనము పూర్వము కని వినని విషయములు కలలో రావు. ఈ పంచముఖబ్రహ్మ యెవఁడు ?
కృష్ణ:—గోవిందమ్మగారి యింట్లో చూడలేదా, విశ్వకర్మపరాత్పరుని విగ్రహము? శివకోట్యాచార్యులుగారు పూజించెడి దైవము!
కమ:—అదియా? మాతాత రహస్యముగాఁ జెప్పుచుండును. బ్రహ్మకు నిజముగా నిప్పుడు నాలుగుతలలే యున్నవఁట. అయిదవతల యెన్నడో శివుఁడు తెగవేసె నఁట.
కృష్ణ:—ఇఁకనాధోరణి నాపుము. గోవిందా! తరువాత నేమి జరిగినది?
గోవిం:—చెలీ!

సీ॥ కరుణయో, మకరంద ♦ కందళంబులొ గాని,
కన్నుఁ దామరలందుఁ ♦ గ్రక్కువాఁడు,
అల వనమాలయో ♦ అక్షమాలయొ గాని,
అఱుత వ్రేలాడఁగా ♦ నలరు వాఁడు,
చిన్ని పచ్చమడుంగొ, ♦ చీనాంబరమొ కాని,
కటిసీమ కీవిమైఁ ♦ గట్టువాఁడు,

చెన్నులో, శుభముల ♦ చిన్నెలో యగుఁగాని,
దర చక్రములఁ గేలఁ ♦ దాల్చువాఁడు,
తే॥ గీ॥ మహిత మహిమంబొ, శాంతసం♦భవమొ కాని,
దెస దెసలఁ దేజమున ముంచి ♦ తేల్చు వాఁడు,
యోగమూర్తియొ, హరిమూర్తి♦యో యెఱుంగఁ,
గాని, యొకప్రోడ కన్నుల ♦ కఱవు దీర్చె;

కృష్ణ:—ఓహో! అతఁడు సాక్షాన్నారాయణ మూర్తియే కాఁబోలు, తరువాత.

గోవిం:—ఉ॥ ఆయెడ భక్తి నాహృదయ♦మంపునఁ బెంపెసలారగా మనో నాయకుఁడాతఁడే యని, ప్ర♦ణామ మొనర్చితి; నంత నన్ను సాధ్వీ! యని, చేరరాఁబిలిచి ♦ దీర్ఘసుమంగలివై తనర్చుమం చాయతులాత్మజుఁడొక్క ఫల♦మప్పుడొసంగి యదృశ్యుఁడాయె చనెన్;

కమ:—తాఁడే లేదు గాని, అది మూరెడు, బారెడగుఁగాఁబోలు? అయినను మహాత్ముల వాక్కులు వ్యర్థములగునా?

కృష్ణ:—ఎప్పటికిని గావు. మన గోవిందకు వివాహము సమీపించినది.

కమ:—ఒసే ఒసే! నావీఁపుమీఁది పుండు సవరించవె. నాకుఁ జేయందుట లేదు.

కృష్ణ:—పుండెక్కడనే? పొక్కైన నున్నదేమో, కానుపించుట లేదు.

కమ:—అమ్మయ్యో! పెద్దపుండేనే. మొన్న గోవిందమ్మ కొట్టిన దెబ్బకు వీఁపు వాచి పోయినది. అది పెద్ద వ్రణమైనది.

కృష్ణ:—మన గోవిందేమి? కొట్టుటేమి? నిజముగాఁ గొట్టిన నీరోగమే వదలి యుండెడిది.

కమ:—నీవు నవ్వకే. నిజముగాఁ గొట్టినదే; నేనబద్ధమాడుట లేదు. (అని ఏడ్చును.)

కృష్ణ:—అదేమిటే కమలా? ఏడ్చుచున్నావు!

గోవిం:—కమలా! కమలా! నేనెప్పుడు కొట్టితినే? నిన్ను నేను కొట్టుదునటే?

కమ:—సత్యముగా మొన్న కలలోఁ గొట్టినావే!

కృష్ణ:—ఓసి గడుసు దొంగా! నిజముగా నేడ్చుచున్నావనుకొంటిమి. కలలోఁ గొట్టుటేమి? వాచి, వ్రణమగుటేమి? ఇప్పుడేడ్చుటేమి? వ్రణమేదే?

కమ:—కలలో మాటలు ఫలించునని గోవింద యుబ్బుట లేదా? ఫలించునని యననేల? ఫలించినట్లే పరవశ యగుచున్నది.

కృష్ణ:—నీ చమత్కారము మండ! గోవిందమ్మ చిత్తవృత్తి నీకేమి తెలియ వచ్చినదే?

కమ:—నేను చెప్పుదునా? చెప్పుదునా? గోవిందమ్మా! చెప్పుమందువా?

గోవిం:—చెప్పుము.

కమ:—నీ గుట్టంతయు బయటఁ బెట్టెదసుమీ!

కృష్ణ:—గోవిందా! అట్లు వెలవెలఁబోదువేమి? చెప్పుమనుము.

కమ:—చెప్పుదునా? చెప్పుదునా?

గోవిం:—చెప్పుము.

కమ:—ఆకలలో నేనును ఉండలేదా? మొదట నీకు గుడిలోఁ గన్పించిన రాధాకృష్ణుఁడు, నిన్ను జూడఁగనే రాధను విడిచి పాఱిపోయినాఁడు. రాధ వానికొఱకై బృందావనపుఁబొదలలో వెదకుచున్నది. ఆతఁడు మనపెదకొమెర్లకు వచ్చి, ఈయుద్యానవనములోనే గాంధర్వము—

కృష్ణ:— ఛీ! ఛీ! నీకెప్పుడును వేళాకోళములే. మిన్నకుండుము. గోవిందమ్మా! ఆశీర్వాదమైనపిమ్మట నేమి జరిగినది?

గోవిం:—ఒకదానికొకటి సంబంధము లేని యుదంతములు. కమల యున్నటుల నాకు వివాహము—

కమ:—నేనాస్వప్నములో నున్నానని చెప్పలేదటే? ఆస్వప్నములోఁ జేపట్టిన నీప్రియుఁడు నిన్నప్పుడెడబాసి పోయినాఁడు. అంతియే గదా?

కృష్ణ:—నీసరసములు దుర్భరములే! నిన్ను నెన్నుపాముకొమ్ముచాటుల మోదవలసినదే.

కమ:—"వెంకిపెండ్లి సుబ్బిచావునకు వచ్చిన" దను సామెత యున్నది గదా! గోవిందమ్మను పెండ్లాడ, నాకు దెబ్బలాయెనా?

కృష్ణ:—ఎవరికిఁదగినది వారికను సామెతమాత్రము లేదా?

కమ:—అందుల కింగాలుపడి నిలుచున్నదిగదా నీవేమందువు? గోవిందుడు పెండ్లిచేసికొనలదాటిరా? తండ్రి పెండ్లిచేయకున్నాఁడా? చేసికొనెడివారు దొరకలేదా? శ్రీమంతులయింటిబిడ్డ. విశ్వబ్రాహ్మణులలోఁ గలవారగుదు. అనేకులు గోవిందనుద్వాహమాడ శివకోటయ్యగారి కృపాకటాక్షములఁ బడయఁగోరి, ప్రహితపాడుచున్నారే! వలదనవలదననేల? ఇటుల రహస్యముగఁ గూడనేల? పెండ్లి ఈడుతప్పి చాలదినములాయె. లోకాపవాదములను వినిగ తండ్రియుఁ గుపితుఁడైయుండె పెంకెపట్టు వీడకకాంతుఁడిట్లుంట తల్లికిని దుర్భరముగనున్నది. ఇక నీమోను వివాహముగాదని నిరాశఁజెంది మనోరోగములుమఁ గృశించుచుండిరి; ఇప్పటికైనను గోవిందకుఁ బశ్చాత్తాపము గల్గెనే.

కృష్ణ:—ఈయుపన్యాసమేలనే? అతివాచాలతకూడదుసుమీ!

కమ:—నామాటలు ముగియనిమ్ము. ఈమెకుఁ బెండ్లిగాదని మీకు దిగులేమోగాని, నాకు దిగులులేదు. ఏమందువా? ఈకాలములోఁ గామినీకాంచనములకు దాసులుగానివారెవరు? తండ్రికడఁ గాంచనమున్నది. ఈమె కామినిగాదా! యౌవనవతియైయున్నది! గాంభీర్యమొకింత యతిశయముగనున్నను, దానిని మెచ్చువారే యుందురు పశ్చాత్తాపము గలిగెనా? అవునవును! మించిపోయినది లేదు.

కృష్ణ:—ఛీఛీ! గోవిందా! కలలోఁగన్నయర్థము లనుభవనములు కావు. కాని, యిప్పుడు నీకు వాంఛజనించెనని నాకుఁ దెలుపవు.

గోవిం:—కృష్ణా!

తే। గీ। మనసు, చిత్తము, బుద్ధి, యే♦మహితునందు
లగ్నమయి పోయె, నతఁడె వ♦ల్లభుఁడు నాకు;
సకియ! యిన్నాళ్ళనుండి నే♦స్తంబు సలిపి,
యెఱుఁగకున్నావె నామనో♦వృత్తినింక?

ఆ। వె। తలిరుఁబోఁడి! మది ప్ర♦ధానమందురు మనో
వాక్శరీరములను, ♦ వానిలోన
మదిని వలచినట్టి ♦ మగనిఁబోనాడి, వే
ఱొకనిఁ గోరుటేటి ♦ యొప్పిదంబు?

కృష్ణ:—సఖి! ఇంత పట్టుదల యేల? నిజముగా శ్రీహరి నీకొఱకై యవతరించి వచ్చి నిన్ను పరిణయమాడుననే?

గోవిం:—అదేమో నేనేమి చెప్పఁగలను.

ఉ। కందొవలాం దయారసము♦గ్రక్కెడఁలన్, ముఖకంజమందు నా
నందము చిమ్మిరేఁగ, జత♦నంబెనయన్ గడు గారవంబు దన్
జెందఁగఁ, జుట్టువాలుగల♦చేతను నావలకేలు వట్టి యో
సుందరి! నీయభీష్టమిది♦సూవె కదా ఫలియించెనేయనన్;॥

సీ॥ ఆయందకాఁడె కా♦దా నన్ను వీడక
కనుమూయునంతలోఁ ♦ గానుపించు;
ఆ చక్రధరుఁడె కా♦దా నాదు పేరెద
హత్తిపఁ గుహరుగా ♦ నత్తమిల్లు;
ఆ దయాపరుఁడె కా♦దా నేను మఱచిన
విస్మృతిఁ గొననీక ♦ వెంటనంటుఁ;
ఆ హాంతకాఁడె కా♦దా నాకుఁ బెఱచూడ్కి
మునుకొనన ప్పుడే ♦ మ్రోల నిలుచు;

తే। గీ। అయ్యయో! యింక నేనేమి ♦ యాచరింతు?
ఏమి గణుతింతును? దదన్య♦మేమి తలఁతు?

దిక్కు, కాలంబు, సంస్థితిఁ, జక్క విడిచి
సకియ! యెల్లెడ నతఁడె ప్రసన్నుఁడైన.

కమ:—హరిం దలంచినంతనే దీనికిఁ బులకరింతలు. ఆయవస్థఁ జూడుము!

గోవిం:—నీవమాయికవు. వాచాలత హెచ్చు. భావగ్రహణశక్తి శూన్యము. చిరపరిచయముండెఁగాని, లేకున్న నీపలుకుల కితరులు కినియుదురు.

కమ:—నీకుఁ గోపము లేకున్నదందువా?

గోవిం:—కమలా! సత్యము వచించెద. నీపైఁ గినుక లేదు. లేదు.

కమ:—నాకుఁ బశ్చాత్తాపము గలుగుచున్నది. నోటికిఁ దాళము వేసెదను. నీసంగతి పూర్తిగఁ దెలుపుము. ఈపొలయల్కయేల?

కృష్ణ:—మఱల వెనుకటి ధోరణియే!

గోవిం:—భక్తిని బరిశోధించిగాని భగవంతుఁడు ప్రసన్నుఁడు గాఁడు. ఆశాపాశములు, అపవాదభయములు, అహంకారమమకారములు, నరునిఁ బూర్తిగవిడిచినఁగాని, నారాయణుని యనుగ్రహము బొడసూపదందురు.

కృష్ణ:—నీవన్నిటిని విడిచితివిగదా? జనకునివాత్సల్యము, జనని మోహము, బంధుగుల యనురాగము, నిన్ను విడిచినట్లే.

గోవిం:—అట్లనఁదగదు. అంతయు నటన, పెద్ద నాటకము! వారందఱక్షేమమును నివురుగప్పి యున్నది. నన్ను ద్వేషించువారు కారు.

కమ:—నీయలసభావము చూచి, యెడముగఁ దొలఁగవలయుననియే తలఁచుచుందుముగాని, చేతఁగాకున్నది. నీవు మాటాడకున్న నాకొడలు మండును. నిష్ఠురములాడుదును. హేళనలు సేయుదును. నీవు తొణఁకవు. నేనే పశ్చాత్తాపముఁ జెందుచుందును.

కృష్ణ:—చెలీ! నిజము పలుకుదునా? నీపరధ్యానము గాంచి మేము పల్మారు తిరస్కారభావముగ భ్రమించుచుందుము సుమీ!

గోవిం:—ప్రాణమిత్రములారా ! నన్ను నేను తిరస్కరించుకొనం జాలుదునా ? మీకును నాకును భేదము కలదా ? శరీరపు లాభాసమాత్రములు.

కమ:—చాల ప్రొద్దెక్కుచున్నది. త్వరగాఁ బూలు సమకూర్చుకొని పోదము.

( తెరపడును. )

---

రెండవ రంగము.

(శివకోట్యాచార్యులును, దావూదుసాహెబును, ప్రవేశింతురు.)

దావూ:—కోటాచార్ భాయీ! ఇయ్యాల మసీదులో భత్తమాపా!

శి|కో:—ఏమిటది?

దావూ:—చెప్తాగాని, మాబీబీ పోగుల్కి తయార్ సేశారా?

శి||కో:—నేఁడు మాపండుగదినము. పనులు గట్టిపెట్టి యున్నాము. రెండు దినములాగి రమ్ము.

దావూ:—ఇంకా రెండుదినాల్? ఇగ్గో అంటార్ ఆర్నెల్లు సేస్తార్. పాతయి బాగాసేస్తాన్కి ఇంతకాలం పట్టుంది? పేదోళ్ల పనంటె యింతే.

శి|కో:—అట్టిదేమియు లేదుగాని నాలుగు రోజులుండి రమ్ము.

దావూ:—మల్లీ మాట్లాడ్తే పదిరోజుల్! రెండు దినాలంటాన్, ఇప్పుడ్నాల్గురోజులంటావ్. అరే భాయీ! యింటకాడ నాతిప్పల్ యిచారించావ?

శి|కో:—నిన్ను పదే పదే త్రిప్పుటకిష్టములేక చెప్పినాను. నాలుగు దినాలుండిరమ్ము భాయీ! నీపని పూర్తిచేసి యిచ్చెద ... మసీదులో నేమిజరిగెనంటివి ?

దావూ:—అవున్, సెప్టం మర్చి పొయ్యాం భాయీ ! వుదయాన్నే నమాజు సేస్తూ వుండాం. వొకయిన్సభ్బమ్మ వొచ్చాడు.

మోనమాజు సేస్తావుంటే నిల్చబడి సూత్తావుండాడు. పిచ్చోడు అని తలుస్తాం. మాకీ కన్నెట్టి సూత్తావుండాం. మేమంతా రుమాలా ల్పరిసి కూచున్నాం. ఆడ్కి సుత్తీమూరాం కింద పెట్టాడు. మొగాన బూడిద. మసీదులో నమాజ్. చాలామందికి కోపం వొచ్చేసింది. దంచేవాళ్లే.

శి కో:—ఎందుచేత? హిందువులు మీమతములోఁ గలియుట మీకు హితమె గదా?

దా ప్రూ:—కలిస్తే శభాష్ అంటాం. ఆడి మొగాన బూడిదుందిగా. తల్మీద పిల్కజుట్టుందిగా. మమ్మల్కి యెక్కిరించాడ్ తలచామ్.

శి కో:—నిజముగాఁ బిచ్చివాఁడేమో!

దా ప్రూ:—యేం తెలుసుద్దీ, సెప్తా యిను.

శి కో:—వానిని గొట్టలేదుగదా, ముందు చెప్పుము.

దా ప్రూ:—అంతా సెప్తాగా. ఆడు మేంజేసినట్టిల్లా సేశాడు. మేమంతా సుట్టూ శేరాం మాకీ హెక్కిరిస్తావ్? అని కేకల్ సేసాం. పాపం ఆడ్కి మాటల్సేసాల్లేదు. మమ్మల్ని తోసేసి, నబీసాహెబ్ ఆడ్కి నెమ్మదీ అడ్గాడు. ఆడ్డీ కందుల్మల్లయ్యపల్లంట. ఖమ్మరం సేస్తాడు. హిందూం ఖర్గుతాడు. బడా బడా సుష్టిత్తాడంట,

శి కో:—మసీదున కేలవచ్చెను ?

దా ప్రూ:—ఆ సేదోవూళ్లో హిన్నరాల్లుంటయ్యంట. ఆటికి పోషం పోతుండాడు. మానమాజ్ కేకల్ యిన్నాడంట వొచ్చాడు. అల్లా భకితి పుట్టిందంట! నమాజ్ కల్సిపోయాడు. మతంపుచ్చుకుంటాన్ హడ్గితే మల్లా వొప్పుకోడూ. (ఇటునటుచూచి) హడ్గో హడ్గో! ఆతడే మీాయింట్కి వొస్తావుండాడ్. ఈడ్కి దేవుళ్ళాగా సిత్రంకన్పడ్తాడేం భాయీ! ఆదిక్కుకీ చూడు! చూడు! అరే!! అచ్చొవుండాడ్.

(వీరప్ప ప్రవేశించును.)

శి కో:—వీాదేయూరయ్యా ?

దావ్రూ:—మళ్ళా యిట్టా మారిపొయ్యావేం ? నీకే హిందాక అట్టా కన్పడ్డావ్ ? నీక్కే మసీద్పుడాంకాదూ ? నమాజు సేశావ్ ?

వీర:—అక్కడకు వచ్చితిని.

దావ్రూ:—బడాబడా మాటా సెప్పావు. హిందువుల్కీ మంచీ వుండావ్, ముసల్మానుల్కీ మంచీ వుండావ్.

శి॥కో:—అయ్యా ! మీరెక్కడనుండి వచ్చుచున్నారు ?

వీర:—నేను కందిమల్లయ్యపల్లిలో నుందును. మనువృత్తి సేయుదు. విశ్వబ్రాహ్మణకులుఁడనని చెప్పుదురు. ఇనుపరాళ్లు తెచ్చి కొలిమిలోఁ గరఁగుచుందును. అవి తెచ్చుటకే పోవుచున్నాను.

దావ్రూ:—బలే బలే ఘనుల్సేస్తాడంట!

శి కో:—చాలకాలముక్రిందట వీరప్పయను కుఱ్ఱవాఁడొకఁడు బనగానపల్లెలో నుండెడువాఁడఁట. గరిమిరెడ్డి అచ్చమ్మగారి పసులను గాచుచుండువాఁడఁట. మీరెఱుఁగుదురా?

వీర:—అవును. నేనే.

శి॥కో:—నీవేనా?

వీర:—అవును.

దావ్రూ:—ఆయన మాయల్మాయ లూస్పేవాడంట!

వీర:—ఏమి మాయలు?

దావ్రూ:—మొగావుల్కీ పాలు పితికేవోడంట, గంపెడన్నం తినేవోడంట, బట్టల్లోపోసి పాల్తెచ్చేవోడంట, హడవుల్లో బడాపులుల్తో హాటాడేవోడంట!

వీర:—అన్నియు నబద్ధములు. ఏవేవో కల్పనలు పుట్టుచుందును.

శి॥కో:—కొన్నిమహిమలు చూపించినట్లు నేనును వినియుంటిని.

వీర:—తెలియనిచర్యలు మహిమలు. తెలిసినవి ప్రాకృతములు.

శి॥కో:—నీకుఁ దలిదండ్రులు గలరా ?

వీర:—లేరు.

శివ:—అన్నదమ్ములో ?

వీర:—లేరు.

శి|కో:—అక్కచెల్లెండ్రు ?

వీర:—వారును లేరు.

శి|కో:—పాడిపంటలున్నవా ?

వీర:—నేను కడుపేదను.

శి|కో:—మిరాసి యున్నదా ?

వీర:—లేదు. సొంతపనులను జేయుచుందును.

శి|కో:—వేదాధ్యయనముఁ జేసితివా ?

వీర:—వేదార్థము నెఱుఁగుదును.

శి|కో:—ఈవైపునఁ దద్దినపుమంత్రాలైన నేర్చినవిశ్వబ్రాహ్మణులు చిక్కుట లేదు. నీవపరకర్మలనైనఁ జేయింపఁగలవా ?

వీర:—వలసియున్న ...

శి|కో:—ఆమూట యేమిటి ?

వీర:—రాగిసంకటి.

శి|కో:—చల్దియా ?

వీర:—అవును.

(తెరలో) దేవపూజకు వేళయైనది. వంట సిద్ధముగా నున్నది.]

శి|కో:—ఇదే వచ్చుచున్నాను. దావూద్‌సాహెబూ! పోయిరమ్ము.

దావూ:—సలాం ! సలాం ! నాల్గోరోజూ యియ్యాలి.

(నిష్క్రమించును.)

శి|కో:—నీపేరేమి ? వీరప్పయా ?

వీర:—అవును.

శి|కో:—వీరాచార్యులనియైనఁ జెప్పుకొనరాదా ?

వీర:—చిత్తము. అటులనే చెప్పుకొందును.

శి|కో:—సంధ్యావందనముఁ జేసితివా ?

వీర:—ఏదో చేసితిను.

శి|కో:—అట్లు పడమరగాఁ బోయినఁ జెఱువు గలదు. స్నానముచేసి రమ్ము. చల్దిమూటచటుపెట్టుకొని పొమ్ము.

వీర:—మీరు దీనిని కొంచెము జాగ్రతపెట్టుడు.

శి కో:—ఆగోడనున్న మేకున వ్రేలఁగట్టిపొమ్ము.

వీర:—ఇక్కడ నేల? కొంచెము లోపలనుంచుఁడు.

శి. కో:— నేనును స్నానమునకే పోవుచున్నాను. ఇటు తెమ్ము.

(మూటను దీసికొని లోపలఁబెట్టి వచ్చును.)

శి కో:—ఇఁకఁ జెఱువునకుఁబోయి రండు.

వీర:—చిత్తము. (వెడలును)

శి కో:—ఏమి, యీతనివిషయ మత్యాశ్చర్యముగనున్నది!

సీ॥ జలుఁగునవ్వు పసందు ♦ వెలయు నెమ్మోమున
బ్రహ్మతేజం బుట్టి♦పడుచునుండె,
ఆజానుదీర్ఘ బా♦హాదండములయందు
రాజలాంఛనదీప్తి ♦ తేజరిల్లు,
వినయగుణశ్రీలఁ♦దనరు మూరితిలోన
శ్రేష్ఠపూరుషకళ ♦ జేరియుండె,
నిరభిమానతను బూ♦నిన వీనిగతిలోన
సేవాప్రవృత్తి భా♦సిల్లుచుండె,

తే॥ గీ॥ ఇతనియాకృతి లోపల ♦ నేమికలదొ
చూడఁజూడఁగ నాకెంతొ ♦ చోద్యమయ్యెఁ,
దల్లిదండ్రులులేని యీ♦దైన్యజీవి
యెడలఁ బాపము! జాలియుఁ ♦ బొడముచుండె;

పాపము! దిక్కులేనివాఁడు. చేయునది కమ్మరపని, గడపునది మోటుజీవనము. ఏమిచేయఁగలఁడు? ఈప్రాంతములఁ బారు షేయయాజకులు మృగ్యముగనున్నారు. వీనికిఁ బురోహితవృత్తి నేర్పిన బాగుండునని తోఁచుచున్నది.

(గోవిందమ్మ ప్రవేశించును)

గోవిం:—నాయనగారూ!—నాయనగారూ!—పలుక రేల ?

శి కో:—ఏమిపని ?

గోవిం:—నాదొక మనవి యున్నది.

—నీమనవులు మాఘవునకుఁ దెలిపికొమ్ము.

గోవిం:—అటులఁ జేసికొనుచునే యున్నాను. మీతోఁడఁ జెప్పుకొన వలసిన విన్నపమున్నది.

శి.కో:—అవసరములేదు. పొమ్ము! మామాటాలకింపని నీవు, నీ మాటాలకింపుమను టెందులకు ?

గోవిం:—నాపైఁ గోపింపకుఁడు. దయఁ జూపుఁడు.

శి కో:—వినయవిధేయతలులేని తనయులందు దయగలుగు టెట్లు ?

గోవిం:—వినయముతోఁడ మనవి యొనర్చుకొందును. ప్రార్థన నాలింపుఁడు.

శి.కో:—స్నానమువేళ యైనది. సత్వరము తెల్పుము.

గోవిం:—మనయింటి కొకపురుషుఁడు, అతిథిగావచ్చియున్నాఁడుగదా?

శి.కో:—ఎవరు ?

గోవిం:—ఇప్పుడు స్నానమునకై చెఱువునకుఁ బోయినపురుషుఁడే.

శి.కో:—అయిననేమి ?

గోవిం:—ఆపురుషోత్తముఁడు నీయల్లుఁడు గాఁగలఁడు.

శి.కో:—ఓసీ! వ్యర్థురాలా! ఏమంటివి?

ఉ ఎందఱు రూపవంతులు, మ♦ఱెందఱు పుష్కలవిత్తవంతు, లిం
కెందఱు కీర్తిరాజితులు, ♦ నెందఱు సత్కులవంతు, లింపురా
నందఱఁ బోవఁబెట్టి, యొక ♦ యందముచందము లేనివానిపై
నం దమినిల్పిచెప్పఁదగు ♦ నా? తగునా తగువానిఁ జేయఁగన్ ?

అయిననీతనియునంతము తెలియదు గాఁబోలు—

సీ॥ తలిదండ్రులెవ్వరో ♦ తెలియంగరాదఁట
పారంపరీక మేర్పరుపఁ గలవె?
స్థిరవాసమెచటనో ♦ తెలుప నోపఁడఁట
యిల్లొండు గలదని ♦ యెంచఁగలవె?
ఇతఁడు నావాఁడని ♦ యేర్చి చెప్పండఁట
బంధువుల్గలరని ♦ పలుకఁగలవె?
కలనైన బంగరే ♦ కని యెఱుంగండఁట
కలిమి యొక్కింతేనిఁ ♦ గాంచఁగలవె?

తే॥ గీ॥ ఇట్టియాతఁడు నీకు నె♦ట్లిచ్చువాఁడ మొ?
కన్నె! నీవేడ! యితని నీ♦వెన్ను టేడ?
ముగ్ధ! నిర్భేద నీకుఁ గాఁ♦దగినవాఁడె?
తెలివి తేఁటలీరీతిగాఁ ♦ దేజరిలెనె?

కటా! ఎట్టియూహా! ఈసూచననైనను నేను భరింపఁజాలను. నాకినుకను రగుల్పక వెంటనే యిటనుండి చనుము.

గోవిం:—చూపులచే మోసపోఁదగదు. ఏరియోగ్యతయైనను నుడువులందే బ్రదర్శితమగునా? పరిశీలించినమీఁదట మీఁకే తెలియఁగలదు.

శి కో:—ఏమినీయాగడము? కొద్దిగనో, గొప్పగనో, వానికులశీలముల విచారించిన నాకుఁగాక, తొంగిచూచితివిగాఁబోలు వాని యోగ్యతయెల్ల నీకు గోచరించినదియా? చాలు చాలు! అతిప్రసంగము కట్టిపెట్టి వెడలుము.

గోవిం:—నామొఱాలించుము. తండ్రీ!

శి॥కో:—మామొఱల నడవిరోదనముఁజేసిననీవు, మమ్ము మందలింప వచ్చితివా?

గోవిం:—దయ వహించి శాంతముగ వినినఁగాక నాకిఁక దిక్కెవరు?

శి॥కో:—ఆ॥ వె॥ మొదట బీరములును, ♦ దుది బేలతనమునా?
తనయ! యిట్టిపట్టు♦దలను విడువు;
మర్త్యమైనవాని ♦ నన్యునేఁగొని తెచ్చి
చిఱుత! నీకుఁ బెండ్లి♦సేయువాఁడ;

సాక్షాత్తు నలినాక్షుఁడే దిగివచ్చునని వాదమొనరించిననీవు, ఇటుక నరాధముని వరింపనేల? ఇట్టినీచులవరించుట మన పదవికిఁదగిన చైదము గాదు సుమీ!

గోవిం:—హరి హరీ! పాపము శమించుఁగాక!

శి॥కో:—నీగొడవ నాకర్థమగుటలేదు. పాపమేమి? శమించుటేమి?

గోవిం:—ఆమహనీయుఁడు మున్ను నవనీతచోరుఁడై యవని నలంకరించి నతఁడేసుఁడీ!

శి కో:—కండ్లకుఁ బసరుదట్టినప్పుడు విపరీతదృష్టి యిటులనే యుండును.
ఛీ! ఛీ! పొమ్ము!

(కోపముతో వెడలిపోవును.)

గోవిం:—ఇకఁ నేఁ జేయజాలుకర్జమెయ్యది? జననికడ కేఁగి వేడుకొనెద.
ఆ శ్రీపతిని మదిని నిల్పి ప్రార్థించెదనుగాక!

"సశంఖచక్రమ్, సకిరీటకుండలమ్,
సపీతవస్త్రమ్, సరసీరుహేక్షణమ్,
సహారవక్షస్థల కౌస్తుభశ్రియమ్,
నమామి విష్ణుమ్, శిరసా చతుర్భుజమ్."

(నిష్క్రమించును.)

(తెరవ్రాలును.)

ఇది తృతీయాంకము.

---

# బ్రహ్మానందలీలలు

---

## చతుర్థాంకము.

---

### మొదటి రంగము.

(విష్కంభము.)

(నలుగురు బ్రాహ్మణులు ప్రవేశింతురు.)

1 బ్రా:—మీకు దెలిసినదేమో చెప్పరాదా; ఇంతగ్రంథ మెందులకు?

2 బ్రా:—వినెడివారికిగదా చెప్పుట.

3 బ్రా:—మీకు తెలిసిన చెప్పుడు! వింటము. ఆమోటుమానిసిని మీరింత మోహింతురేల?

4 బ్రా:—ఆపెండ్లికుమారుడు కమ్మరముచేయుటకు నేర్పరి. లోహపు రాళ్ళనుండి ఇనుమును పైకిదీయుటలో కుశలుడు. పైకిమోటుగా కన్పింపవచ్చును. కాని వానిముఖమున మహాతేజమున్నది. ఆతపశ్శాలి గొప్పమహిమలుగలవాడు. శివకోట్యాచార్యులుగారి యింటికి వచ్చునపుడు, చద్దియన్నమను మిషతో ఒకమూటను దెచ్చినాడు. భోజనసమయమున ఆమూటలోని యన్నమునే వడ్డించుమని పట్టుపట్టెనట. దానిని విప్పునప్పటికి అప్పుడే వంటచేసి సిద్ధముగానుంచినట్లుం దన్నము, పాయసము, బూరెలు, గారెలు, చాలకూరలు, పోగల గ్రక్కుచుండెనట. ఎందఱకు వడ్డించినను తఱుగనుగూడ తఱుగకుండెనట. ఇంతకంటె చిత్రమహిమ ఏమికావలెను!

1 బ్రా:—ఒరేయ్! మధ్యాహ్నము రామన్నగారియరుగుమీద పండుకొనియుండగా వారియింట్లో ఈమాటలు చెప్పుకొనుచుండ విన్నాను. చాలచెప్పుకొన్నారు. కాని ఆమాటలు ఏపురాతన

మహానీయుని యుదంతములో యనుకొన్నాడను. నిద్రమత్తులో సరిగవినలేను. అవి ఈపెండ్లికొడుకునుగురించియేనా? నిజమా?

2 బ్రా:—నిస్సందేహముగా నమ్మదగినవే! శ్రీరాములు. నాగావధానులు, భూషణము, వీరంతా మొట్టమొదట ఈసంబంధమునకొప్పుకొనక శివకోటయాచార్యులను ద్వేషించి సహాయమునకైననుబోక బ్రబిగిసిరి. ఈసమాచారములు తెలిసిన మీదట సంబంధమునకొడబడుటయేగాక ఈదినమునసందఱు సంతోషముతో అన్నిపనులలో పాల్గొనినారు.

1 బ్రా:—ఈకాలములో విశ్వబ్రాహ్మణులలో చిత్రమహిమలు చూపువారు పుట్టుచున్నారు. కందిమల్లయ్యపల్లెనుండి, కరణం వెంకటేశ్వర్లు మాఅక్కగారింటికి వచ్చినాడు. ఆయూరిలో గంగానమ్మ జాతర జరిపినారట. జాతరచందాలు వసూలుచేయుచు వెంకటేశ్వర్లు గుడిదగ్గర కూర్చున్నాడట. అందఱు చందాసొమ్ము చెల్లించివేయగా, ఒక్కవిశ్వబ్రాహ్మణుడుమాత్రము మిగిలెనట. ఆతనిని పిలిపించగా పట్టుకారు నొకదానిని చేతపట్టుకొని వచ్చెను. కరణం వానిని గద్దించి సొమ్మునడుగుచుండ, అతడు పరధ్యానముగా విని సొమ్ము చిక్కలేదని ఏవోసాకులు చెప్పుచు "ఓగంగీ! కొలిమిలోనికి నిప్పుతెచ్చిపెట్టవే" అని కేకవేసినాడట. గుడిలో నివిగ్రహమునుండి పదేండ్లబాలిక వెలువడివచ్చి ఎదుట ధూపము వేయునిప్పుకుందిని తీసుకవెళ్ళి అందించినదట! చూచితిరా!!

4 బ్రా:—తరువాతనేమైనది ?

1 బ్రా:—అతడు నిప్పుతీసికొని కుందిని ఇచ్చివేసినాడు. ఆబాలిక తీసికొని మఱలినది. తిన్నగా గుడిలోనికిపోయి అందలి విగ్రహములో కలసిపోయినది.

2 బ్రా:—కడు విచిత్రముగానున్నదే! మహాద్భుతమహిమ!!

1 బ్రా:—అదికని వెంకటేశ్వర్లు దిగ్గునలేచివెళ్ళి ఆ విశ్వవిప్రునకు సాష్టాంగములుచేసి క్షమాపణ కోరినాడట. అక్కడివారంద

అను వానికి మ్రొక్కులు సాగించినారట. ఈసంగతి వెంకటే శ్వర్లుగారితో మాఅక్కగారింట చెప్పుచుండగా నేనువిన్నాను.

3 బ్రా:—ఆవిశ్వబ్రాహ్మణుని పేరేమి? నేను పదిదినాలలో అక్కడకు పోదును. విచారించి వచ్చెద.

4 బ్రా:—నీవక్కడికేపోవునప్పుడు పేరే తెలిసికొనలేవా ?

1 బ్రా:—వానిపేరు పోతులూరు వీరప్పయట.

2 బ్రా:—ఈపెండ్లికొడుకే ఆయన. ఈయనపేరు వీరప్ప, ఊరు కంది మల్లయపల్లె.

1 బ్రా:—అట్లనా? నేను పేరూరులు విచారించ లేదు.

2 బ్రా:—మీకు సంభావనరంధేగాని యితరమెందుకు ? నేనింకొక విషయముకూడ విన్నాను. ఈయన శిల్పమున కడునేర్పరి. మహాతపశ్శాలియని చెప్పనక్కఱయేలేదు. వానినేత్రములే వలదన్నను సాక్ష్యమిచ్చును. ఈయన అయోనిసంభవుడు. తగిన గురువు నీప్రాకృతజగమున గనలేక తనలీలానుగుణ్యమగు గురువుగ "వీరభద్రస్వామి"విగ్రహమును రచించెనట. కుముదవతీ నదీతీరమున ఒకయడవిలో రహస్యముగ గూర్చుండి దానిని చేసినాడు. ఒకతఱిని తాను తపస్సునందు తన్మయుడై యుండి, చాలసేపటికిలేచి యావిగ్రహమును గనలేకపోయినాడు. అది వరదలో కొట్టుకొనిపోయి, అల్లాడిపల్లెసమీపమున బురదలో చిక్కుకొనిపోయినది. ఆవిగ్రహమునుండి శ్రీవీరభద్రస్వామి ప్రతిదినము బాలునిరూపమున వెలికివచ్చి అచ్చట పసులమేపు వారితో నాడుకొనుచు, తిరిగి నీళ్ళలోనికిపోయి యదృశ్యుడగుచుండెను. ఈసంగతి నెఱిగి పరీక్షింపవచ్చినగ్రామస్థులు వాని నీటిలోనికిబోకుండనడ్డగించి, నీవెవరవనిరి? "నేను వీరభద్రస్వామిని. ఈయేటిలో అదిగో! అక్కడ నాశిలావిగ్రహమున్నది. ఈతీరమున నన్ను ప్రతిష్ఠించుడని" చెప్పి యంతర్ధానుడైనాడు. వారావిగ్రహమును వెదకితీసి ఆసమీపమున బ్రతిష్ఠజేసిరి. కొన్నాళ్ళకీసంగతి నెఱిగి, వీరప్ప ఆచోటికివచ్చు తనగురునిచెంత

తపమాచరించి, బ్రహ్మసాక్షాత్కారమును పొందినాడందురు. ఆగుడియు, అచ్చటిమఠమును, వీరప్ప యొక్క రాత్రికాలమున స్వహస్తములతో నిర్మించియున్నాడు. చూచితివా? వీరప్ప మహిమ!

3 బ్రా:—నాకీసంగతులు తెలియలేదు. కాని నాకాశ్చర్యము కలుగదు. విప్రవినోదులు కనుకట్టుకట్టి సంతర్పణలుచేయరా? విగ్రహములనుండి బాలికలువచ్చుటయునట్టిదే. ఎన్నోవిగ్రహముల సృష్టింతురు.

4 బ్రా:—ఎన్నిమహిమలైనా లోకములో నీవంటివాండ్ర తలద్రిప్ప జాలవు. నాడు కృష్ణునిమహిమలు కంసుని, జరాసంధాదులను, జక్కజేసినవా?

2 బ్రా:—వారిని జక్కడంచినవి. కోట్లింగముకూడ వీరి తరగతిలోనివాడే. ఎన్నిచెప్పినను శివకోటాచార్యులుమీది ద్వేషమును వదలుకొనక పెండ్లికిపో నిరాకరించి బిఱ్ఱబిగిసియే యున్నాడు; దగ్గిఱచుట్టమేగదా?

1 బ్రా:—శిశుపాలుడు కృష్ణునికి దగ్గిఱచుట్టమేగదా? చుట్టఱకానికేమిలే! పెండ్లికుమారుని పేరు వీరప్ప యని తెలిసినచో నేనంత క్షేమియుండను. అక్కడికివెళ్ళి చూచి వద్దామురండి! ఒకసారి వానికి నమస్కరించి రావలయునని నామనస్సు తహతహ పడుచున్నది. మనము పునీతుల మగుదము రండు.

3 బ్రా:—నాకు వేఱుపనియున్నది గాని, మీరు పోయిరండి! నేను తర్వాతలోన కందిమల్లాయపాలెము పోగలను. అప్పుడు చూచెదను. (వెడలిపోవుదురు)

4 బ్రా:—నీకర్మము, పో. (తెరవ్రాలును)

ఇది విష్కంభము.

## రెండవ రంగము.

(ఉద్యానవనము. వీరప్పయు, గోవిందమ్మయుఁ, బ్రవేశింతురు)

వీర:—లతాంగీ! నన్నీయుద్యానవనమున మున్నొకసారి గలసికొంటి నంటివే, అదెట్లు?

గోవిం:—కలియుటేగాదు. గాంధర్వమున—

వీర:—కటా! నేనెంతమోసపోతిని. నీకు ద్వితీయవివాహమా?

గోవిం:—(భయముతో) నాథా! ఏమనుచుంటిరి?

వీర:—తే॥ గీ॥ ఎవని గాంధర్వవిధి వరియించి చెట్ట
బట్టితివో, యాతఁడప్పుడే ♦ వెడలిపోయె;
నన్నె వానిఁగ భ్రమపడు ♦ చున్నదాన
వతివ! దవ్వుగఁబొమ్మిప్పు ♦ డనఁగనేమి?

గోవిం:—(వణఁకుచు) ప్రాణప్రియా! నోటమాటరాకున్నది. భీతిగల్గు చున్నది. ఏమట్లువచింతురు? సాంతముగ నామాటవినుఁడు! నేనేల యాగొడవనెత్తితిని?

వీర:—మోసము పూర్తిగాదయ్యెనని చింతిలుచున్నదానవా? రహస్యము సదాదాఁగునా? పరమాత్ముఁడు దాఁగనిచ్చునా?

గోవిం:—నాథా! పొరపడుచున్నారు సుఁడీ!

వీర:—సత్యము, సత్యము! పొరపడితిని. పొరపడుచున్నాను. పొరపడను!

తే గీ॥ వయసుమీరని కన్నెల ♦ వలచునపుడు
దూర మెంచకయున్నను ♦ దోసఁగులేదు;
ప్రౌఢలౌ పూవుఁబోండ్లఁ ♦ గేల్పట్టువేళ,
చానరో! జాగరూకత ♦ చాల వలయు;

గోవిం:—(స్వగతము) ధైర్యము వహింపక తప్పదు. (ప్రకాశముగా) ప్రాణనాథా! నిష్ఠురములేల? నేనొక స్వప్నోదంతమును దెలుపఁ గడఁగితిని.

వీర:—అన్నియు స్వప్నములె. సత్యజాగరమునఁ జెప్పువారుండరు. వినువారునుండరు

గోవిం:—నామది చెదరియున్నది. కరుణింపుండు!

వీర:—గుట్టు బయటపడినప్పు డిట్లేయుండును.

గోవిం:—అది స్వప్నాదంతమనుటకు సాక్ష్యమున్నది.

వీర:—ఎవరిసాక్ష్యము?

గోవిం:—నాచెలికత్తె లిరువురకీ విషయమును దెలిపియుంటిని.

వీర:—సాక్షులా, నీచెలికత్తెలు? వారికీవిషయమును ముందేబోధించి యుంటివి.

గోవిం:—శ్రీహరీ! సీతామనోహరా! ప్రియోక్తులాడఁబోయి నేనెట్టి యిక్కట్టు దెచ్చిపెట్టుకొంటిని?

వీర:—తే గీ॥ కొమ్మ! బల్మాఁచివానిఁబే♦ర్కొని నయంబు
చెప్పి, మేల్కొల్పితివిగదే! ♦ సీతనాథుఁ
డనుచుఁడే యకారణపు సంశ ♦ యంబుగదుర?
నాకు నీసాక్ష్యమున్న♦దే సాకులేల? (నవ్వుచు)

గోవిం:—ప్రియా! నన్నిట్లేల బాధించెదరు?

ఉ॥ ఎన్నిదినాలనుండియొ య♦థేచ్ఛగభక్తి గడించినాథ! ని
న్నెన్నిన దానికిక్క ఫలమి♦దేయగునా? భరియింపఁజాల నీ
యన్నువమాయలీల; లక♦టా! యిది నన్ను బరీక్ష సేయఁగాఁ
బన్నినయుక్తిగా కెఱుఁగ♦వా? నిజమెద్దియొ నీవువల్లభా!

ఆ॥ వె॥ ఒరులచిత్తవృత్తి ♦ నూహింపనేమేమి
క్రియరొనర్తొనీవు, ♦ ప్రియుమెలర్ప;
అవియె నీకుఁజూడ ♦ నానందలీలలొ,
వెలయుఁ బ్రాణగొడ్డ ♦ ములుగమాకు;

వీర:—లీలలు లీలలే! నేనాడుమాటలలో నసత్యము లేదు. అకారణముగ నీవ యులుకుఁ జెందితివి. నీస్వప్నములో నేను లేను గదా! నీమనస్సే యొకని నారూపుగలవానిని సృష్టించినది. ఒప్పుకొందువా? నీకలమోసముగాదా? అదిమోసము, భ్రాంతి, అనువిషయము సదా దాఁగదంటిని. పరమాత్మకృపచే మన స్వప్నములన్నియుఁ దొలఁగిపోయి తీరవలయునుగాదే! సత్య

జాగరమున, అనఁగా, అవిద్యానాశమును నీవు చెప్పుదువా? నేనువిందునా? అద్వైతభావమును జెందుదుము గదా!

గోవిం:—(కౌఁగిలించుకొని). మహప్రియా ! మీమాయలు నన్నిఁక బాధింపకుండ ననుగ్రహింపుఁడు!

వీర:—అందువనకొండంబడుఁజాల !

గోవిం:—నాపై కరుణింపరా ? దయలేదా ?

వీర:—

చం! వలదిఁక తత్తరింపఁకెలు♦వా! యితరుల్గనరాదు, నామమా
యలవిడరాద; కైవడుద♦నై చనునాయవతారమిప్పుడే;
పలువ్రతముల్నుతుల్సలిపి ♦ ప్రార్థనసేసితివాత్మలీలలన్,
గలయికలాయదృష్టఫల♦కాలమురా ముగియింపఁబోడియే?

గోవిం:—నాథా ! మీలీలలనంతములై పెఱుఁగుఁగాక ! నన్నవి బాధ పెట్టకుండ వరమిందు.

వీర:—రుక్మిణీకాంతయు, రాధాసతియు, నిట్టివరముల వేడలేదే! లోకసంగ్రహణార్థమై నాలీలలు కొంతకాలము సహింపుము! కేవలాజ్ఞానము నిన్నావరింపదులెమ్ము.

గోవిం:—కొంతయుండుఁగదా! మీచిత్తము. తమ సంకల్పమునకడ్డు చెప్పుదానవా ?

వీర:—ఇప్పుడుగదా నీవు ముదితవైతివి.

గోవిం:—అవునవును. చిత్రనటకులరు. నిమిషములో నవ్వింతురు! నిమిషములో నేడ్పింతురు? ఇదెంత సేపు.

వీర:—ఏదేని ఒక్కటేయనుభవమునుగోరు నరులీలోకమున నుండరు సుమీ !

గోవిం:—నమమనదుమఁ గారమును నంజుకొనక పరమాన్నమునే చాలఁగఁ దినలేము.

వీర:—జగమున్నంతదాఁక ద్వంద్వములుండును. ఉభయములు నానంద జనకములే. తెలివిని జిక్కపట్టిన యానందమును, తెలివి జారి పోయిన దుఃఖమును గల్గుచుండును. ఇంతియేగదా?

గోవిం:—అవును. ఒకే వస్తువునుండి మన మనస్థితిననుసరించి యానంద
మునో, క్లేశమునో, పొందుచుందుము. బుద్ధియందు సమత నా
కనుగ్రహింపుఁడు!

వీర:—అది నీ యధీనమే.

గోవిం:—ఎట్లు? నేనబలను. నాకై నేను సంపాదించుకొనఁజాలను.

వీర:—ఆపూర్వపుటింట విశ్రమింతము రమ్ము. నేను నీకధీనుఁడనైయుండ
సర్వమును నీకధీనమైనట్లే! ఇది జ్ఞప్తినుంచుకొనుము.

గోవిం:—(సిగ్గునభినయించును)

వీర:—చెలీ!

సీ॥ తరితీపులొలసి, బి♦త్తరిచూడ్కులొల్కనీ
కులుకుఁ గన్నులసన్న♦దోలఁగఁగలనె?
అడకువ, పెరిమంబు, ♦ ననుమతి, దొడరుసు
పలుకుఁదేనియవాఁక ♦ బాయఁగలనె?
ఓరిమి, గంభీర,♦మొప్పిద, మొప్పునీ
నడలయాదముద్రోసి ♦ నడువఁగలనె?
ఉడివోనిచెన్నులఁ♦గడుబిసాళించునీ
యొడలిచక్కఁదనంబు ♦ విడువఁగలనె?

తే॥ గీ॥ ముదముదనరార నెమ్మది ♦ మదిని గలిపి,
మరులుగొలిపించు నిన్ను నే♦మఱవఁగలనె?
ఎన్నివిధములఁగన్న నో♦యన్నుమిన్న!
నీకుస్వాధీనుఁడనుగాక ♦ నిలువఁగలనె?

గోవిం:—ప్రాణప్రియా! పాకము ముదురనిచ్చుచున్నారు.

వీర:—ముదురనీయ కేమున్నది?

ఉ॥ ఆతతలీలలన్ వలఁతి♦వై ననుగొంచెమనుగ్రహించి, య
బ్జాతముఖీ! సుధారసము ♦ పాయనమిచ్చినఁజాలు, దాన న
ద్వైతసుఖంబుగాంతుముగ♦దా! మనిమిద్దఱమొక్కసారి; యిం
కాతల నీవు నేననెడు♦నట్టివిభేదము లేమి? కామినీ!

గోవిం:—నాథా ! అటు చూడుఁడు !

తే॥ గీ॥ తరుణసహకారశాఖపైఁ ♦ దనదుచెలిని
వలఁతిపల్కులనెట్లొ గై ♦ వసపడంగఁ
జేసికొని, ముద్దుగొనెడు నా ♦ చిల్కప్రోడ;
కంటిరే! మగవారి ట ♦ క్కరితనమ్ము;

వీర:—చెలీ ! చిలుక చెలువమైనను దీసిపోయినదేమి ?

తే॥ గీ॥ తఱినిదప్పించెఁ బ్రియుఁడని ♦ దఁగురికిన్క
పైకిఁ గన్పడనీక, య ♦ క్కీరశక్తి
నెఱపి, ప్రీతిచుంబనంబుల ♦ న్విషవహించి
పొడుచుచున్నది ముద్దుల ♦ మురిపెమణఁగ;

గోవిం:—ప్రియా ! బదులు తీర్చుకొంటిరి.

వీర:—సఖీ ! నీవాక్ప్రాగల్భ్యముల దాఁటలేనకుకొంటివా ? అటు చూడుము! ఆపూఁబొదరింటఁ దేనెపానకముమీఁది తీపిమెయి కొదమ తుమ్మెద, యెట్టులాకుసుమమున మూఁగుచున్నదో! అటుపోయి దానివిలాసము నించుకపరికింతము రమ్ము !

(ఇరువురు నిష్క్రమింతురు.)

(తెరపడును)

ఇది చతుర్థాంకము.

---

# బ్రహ్మానందలీలలు

## పంచమాంకము.

### మొదటి రంగము.

(మదుమాల గ్రామము. పీరుసాహెబుగృహము. సిద్ధుఁడు, పీరుసాహెబు, ఆదంబీబి, ప్రవేశింతురు.)

సిద్ధు:— పాట॥

శరణుపోతులూరురాయ శరణు యీరబద్రరాయ!
శరణుశరణు ఓదేవరాయ! ఓపోతులూరయ్యా!
కరుణతోడమమ్మేలరా! ॥శరణు॥

సూచ్చమైనాతనువులోన సూరుడేమన్నాడయ్యా?
సూరుడున్నదారి తెలిసితే, ఓపోతులూరయ్యా!
మోచ్చదారము కనులసూసేనూ ॥శరణు॥

ఆదం:—క్యారేబిడ్డా! క్యారేబేటా! సిద్దా! నీకీ దేగం మర్సావ్. ఈ పరద్దానం యేందీబేటా? హెల్లకాలం బమ్మంగారూ! బమ్మంగారూ! హిందేవాగడెం. మనకీ ముసల్మానుమతంవోళ్ళకీ ఛీ దూమంసేస్తార్ లేదూ? ఇదిన్నైనే.

పీరు—ఈడ్కి దోసంయేముంది? మతీసెడింది. జాడ్డెంపట్టుకోంది. బూతం! ఆసైతాన్ పట్టింది. మంచిమంచి వైద్దం సేయించాల. బూతాలైవెజ్జుడు మూడుమేకల్, వొకఖల్లూఖుండా, దిగదుడ్పా సెయ్యాలన్నాడ్గా! మన్కీ సేతులో పైసానై. ఆగాం. పైగా ఏంసెయ్యాలీ? అరేసిద్దా! మీఅమ్మకీ హిట్టా యేడ్పిత్తావ్? నాయంగా వుందా?

సిద్ధు:—మాయీ! నాకీజాడ్డెం పట్టింది షత్తాం. అదీ జన్మాజాడ్డెం. ఈ జాడ్డెం జీవుల దరికీ పట్టీవుందిగామల్లీ! దాన్కిమికిత్సా సేషిచ్చాచ్ లాబంనై. మాయీ! గురుదయా వుండాలీ. హాదే మందూ!

పీరు:—నీకీ మల్లయ్యాపిల్లీ పోనిచ్చాం, తప్పావుంది మాకీ! ఆబమ్మ గాక్ భక్తమాయల్వాషూవుండాక్. వోగైనాదగ్గిర్సేరాహూ, బస్, దయ్యాల్పట్టించాషూ హాన్నమాశే. నీకీహాంతేహాయింది.

సిద్ధు:—నిజం నిజం, పపంచంలో హాందర్కి బడాదయ్యాంపట్టిందిగా. అయిద్దాదయ్యాం పట్టియేసిందిగామల్లీ. హాందర్కీ యిది జన్మాన్కిపడ్లాగుతాది! వోర్కీ వోదుల్తాదీలేదు. దీన్కి పోతుల్బలీ. పెట్బా, షారాయీ పీపాల్పిపాల్ దాగం తాగించూ, హాదీ వోదిలేదీనై. దాన్కి వోట్కేహులుపాయం, వోట్కే హుందీగా! అదీ గుర్మంతరం. అదీజపంసేస్తావూ, దయ్యాం, సైతాన్, మళ్లీ మొగంసూస్తాయీ లేదు. నిశ్చయం, నిశ్చయం!

ఆదం:—హారే అల్లా! హి తత్కడ్వామొన్నామొన్నాకొన్నాం. దాన్కి కొద్వాపెట్టీ మందూతీస్కరావాలా! యేమీసేస్తాంమల్లీ, రోగం బడావుంది.

సిద్ధు:—యిదీ దేగం గీగం జాడ్యాం వుందీలేదూ, మాయీ! యిదీ బవరోగం వుందీ! జనమరోగంమాయీ! యిది నీకీపట్టింది, నాకీ పట్టింది; హాందర్కి పట్టింది!! మందుల్కావాలామల్లీ? మాకీ సెప్తాంయినను.

పాట॥ యిదుగో! బవరోగాల్కి. యిలజౌసాదం
పదిలంబైన గురు బక్తులకీయెల్లా !
శరణు ! అసంగం పూర్ణసంద్రోదయం,
లింగాక్షరవశమే ఆనందా బైరవమూ। యిది।

రమనపంచాచ్చరీ రసబూపతి, సూ
మతిలోగురునీతియె మందూరయేగం,
షతిశంబుసేనయె పరమాపురత్రమూ। యిది।

మాయీ! యీమనిమల్కీ తేనాల? మాంపూప్రా తల్లీ! యీరగుడు దయా బడాపె షదాలుండయి తీస్కనస్తా.

పీరు:—తోబా! తోబా! అల్లాంకతీ లేమాను డిసి. యీస్క కాఫర్ గుడుపాదం పడ్తానుగాడు. బలేపిచ్చా షట్టియేసెందీ యీబే గాకి. యీపిచ్చానోషా అందర్కీ పిచ్చాసెవ్తాడ్. నీవ్రాపిచ్చా నీవుపిచ్చా, అంటాడ్. నిజం ఈడ్కీ బడాపిచ్చవుంది! కాకోవ్తే మంచి వోషోమల్లే యీస్క యెహుర్సెవ్తాక్ యిస్తాను. హారేఅల్లా! హారేఅల్లా! ఆమొక్రిసూపుల్ యొక్కగారా?

సిద్ధు:— పాట

నేసూసినానే - బ్రమ్మంనాలో - నేసూసినానే!
నేసూసినానమ్మ! నెలతారో! తారక .
రాజయోగులగ్నానసే - రమ్యొమైసూపు । నే
కన్నులనడుమాన - సన్నంపుబిలములో -
వున్నతమైట్టీ - పున్నమసంద్రుణ్ణీ నే

ఆదం:—తోబా! తోబా! యీడ్కి హెల్లప్పా ఈరబమ్మా యీరబమ్మా హామ్మిమాటేకాని, అల్లాఅల్లా అంటె నిక్క నోర్రాదే యోపాప? అరేబేటా! వాణ్ణియీరబ్బమ్మాన్ని వాదితేనూరా! నీవ్రా కాఫరై పోతావర్రా?

సిద్ధు:—మాయీ! నేనా బ్రమ్మాన్నిపైకి చెప్తానేను. ఆమాను బావుడు నాలోపలంతా నిండిపోయాడు! నామనస్సును బ్రమ్మం గారిపైకి నేను తిప్పటంలేను. అదేపోతుంది! ఆగదు. సూగు ల్లాగే రాయిలేదూ? అట్లా నామనస్సు గన్తుంది ఆకెరు. అయితే అల్లా, అంటేనాలో ఘుచెప్తాం లేను. అల్లా అన్నోవ్తె బ్రమ్మం గారు నాలోనిండిపోతాడు! అల్లాగాడా మానివున్నాను.

పీరు:—యియ్యా! పిచ్చకూతల్. [illegible] బ్రమ్మా [illegible]?

సిద్ధు:—బ్రమ్మంగారిబతీ నాకు [illegible] [illegible] పిచ్చి [illegible] కావచ్చు. లోకం అందర్నిపిచ్చిపోన్నగా. పిచ్చిచాలారకాల్

సిద్ధు:—బ్రమ్మా, బ్రమ్మా! నీదయ ఉంతులేందికదా. నాయిందిరి యూలు. నాపెళ్లాం. సాదీనం కావడ్నైనె. నీదయ. నిన్నే సూస్తాంటూ పడుకుంటూ. బలే వుపకారం!

(వెరవ్రాలును)

## రెండవ రంగము.

(పందిరిపల్లియందలి బ్రహ్మముగారియింట్లు శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామి, గోవిందమ్మ, గోవిందయ్య, పోతులూరయ్య, ఓంకారయ్య, శివరామయ్య, గిరిరాజయ్య, వీర నారాయణమ్మ, యథోచితముగ నుపవిష్టులై యుందురు.)

గోవిందమ్మ:—అమ్మా! వీరనారాయణమ్మా! మీనాయనగారు వచిం చిన ధర్మములఁ జక్కఁగ గ్రహించితివిగదా ?

వీ|నా:—ఆ! తెలిసికొంటిని.

గోవిం:—గ్రహించిననుజాలదు చెల్లీ! వానిని జీర్ణము చేసికొనవలయును.

వీ|నా:—అన్నా! జీర్ణముచేసికొనుట యననేమి ?

గి రా:—మనము తినునన్నము జీర్ణమైనపుడది మనశరీరములోనున్నట్లు తెలియదు. అది తనువునకుఁ బుష్టినిచ్చి దానిసర్వకార్యములం దును దనమహిమను జూపుచుండును. ఆతీరుననే మనము గ్రహించు వేదాంతబోధలు, మనశీలములో లీనమై, మన చరి తలలోఁ బ్రతిదానియందును, వానిమహిమను జూపుచుండవల యును. అవి కేవలము బుద్ధియందే నిలిచియుండి ప్రసంగసమయ ములందు మాత్రమే పైకివచ్చుచుఁ, దదుపరి అణఁగిపోవరాదు. ఆవిషయములు శబ్దరూపమున మనలోపలనున్నట్లు కాన్పింప రాదు.

పోతు:—ఎన్నైనను జెప్పవచ్చును జిలుకపలుకులు. లాభమేమి? ప్రారబ్ధవశమునవచ్చుశీలము నెవఁడతిక్రమింపఁ గలఁడు? ఈవే దాంతబోధ లాడంబరమాత్రములని నాభావము.

వీ|బ్ర:—నాయనా! శాంతియుండవలయునుసుమీ! నీవనుమాటలలోఁ గొంత నిజమున్నది. సర్వమునకును బ్రారబ్ధమేమూలమని యూర

నుండఁదగను. వాసనారూపము, ఫలానుభవము, సంచిత ప్రారబ్ధము రెండు తెఱంగులఁ బరగును. కేవలఫలానుభవము తప్పించుకొన వీలుండదు. దానిని మార్పుచేయుట కలవిగాదు. అది తుపాకి నుండి వెలువడిన గుండువంటిది. వాసనారూపమగుదానిని మార్ప యత్నము సేయవచ్చును. అనఁగా, దాని ఫలమును, ఆగామికర్మ సంయోగమువలన మార్పఁగలము. కాలువలు త్రవ్వి, ఒక ప్రవాహపునీటిని దాని మొదటి దారినుండి మరల్చి మనముకోరు ఫలితార్థములకు వినియోగింప వచ్చును. ఇట్లుచేయుటచేత ఫలితార్థము మాఱఁగలదుగదా ? అంతమాత్రాన నీటిస్వభావముగాని, ఆనీటిచర్యగాని, భంగమగుటలేదు. అటులనే వాసనారూపమగు ప్రారబ్ధముయొక్క ఫలమును నాశముసేయకయే శ్రవణ, మనన, నిధిధ్యాసనములచేత మార్పు గల్పింపవచ్చును.

గోవిందమ్మ:—కుమారా ! వినుచుంటివా ! నాయనగారిమాటలు? ఏది వచ్చినను నాకర్మము, నాకర్మమని కూర్చుండి, విలపింపరాదు. పురుషప్రయత్నమునకవకాశమెంతేనిఁ గలదు. ఈపురుషప్రయత్నమును బలపఱచి సమర్థమైనదానిగ నొనర్చుటకు, వేదాంతార్థములవినుచుండుట, పఠించుచుండుట, వానింగూర్చి విచారణలుసలుపుచుండుట, తేలినపర్యవసానములను మదిలోనిల్పుట, అత్యవసరము.

వీ॥నా:—మనసెప్పుడును సుఖమునే గోరుచుండును. ఆసుఖము లభింపదు. లభించినను వెనువెంటనే నశించిపోవును. ఈ సంసారయాత్ర కేవలము దుఃఖమయముగఁ గాన్పించుచున్నది. తండ్రీ ! దీనికేమేని యుపాయముగలదా ?

(సిద్ధుఁడు నెమ్మదిగాఁ బ్రవేశించును.)

సిద్ధు:—అమ్మయ్యా! ఎట్లో కట్లు సడలినవి. వానిఁ దప్పించుకొని పాఱి వచ్చితిని. వీరలేదో విచారణ సల్పుచున్నారు. ఇదేమి? బ్రహ్మము

గారిని చూడఁగనే నాభావయు మాఱిపోవు చున్నది! ఆహా! ఎట్టిమహిమ!! పొంచియుండి వీరి ప్రసంగములు వినుచుగాక.

(అట్లుచేయును.)

వీ|బ్ర:—అనిష్టమును భరించుట నేర్చుకొనవలయును. ఈలోకము ద్వంద్వమయము. ఒకదానినివిడిచి రెండవదాని ననుభవింప వీలులేదు. జగమునఁ గేవలానందముగాని, కేవల దుఃఖముగాని లేదు.

తే|| గీ| సుఖముఁగోరుచు, దుఃఖంబుఁ ♦ జూడనోప
రెల్లర; దియెట్టులభియించు? ♦ నించుకంత
సౌఖ్యమునకెంతదుఃఖమో ♦ సంభవించుఁ
దలను బుర్రఁదాల్ప వాడక ♦ నిలిచియున్నె?

శివ:—రెంటిని విడిచిన బాగుండదా?

వీ|నా:—అన్నా! అటుల రెంటిని విడుచుటయు, లోకముననుండుటయు, సంభవించునా?

ఓంకా:—అనఁగా, సుఖదుఃఖములవిడువఁగనే మరణమేసంభవించునా?

సిద్ధు:—ఆఁ! ఆఁ! ఇది మంచిప్రశ్న. బ్రహ్మముగారేమిచెప్పెనో!

వీ|బ్ర:—సుఖముగాని, దుఃఖముగాని, మనస్సుయొక్క అనుభవములు. అనఁగా మనసంకల్పములుపొందునాకారములే.

ఉ|| బాలురు మేనిపై నగలు♦పట్టుగఁబెట్టిన సంతసింతు;రా
బాలకులే వయస్సుతమ♦పైఁబడినప్పుడు వానిఁదీసినన్,
జాలఁగుతూహలంబు వడఁ♦జాలుదురెంతయుఁ;గల్మిలేములి
ట్లేలలితంబులై ముదము ♦ నీయ సుఖేతరంబింక నేమగున్ ?

మఱియు,

తే|గీ|| వితతమగు నీప్రపంచంబు ♦ వెదకి కనిన,
సుఖమునైనఁ, దుఃఖమునైనఁ, ♦ జూడఁబోము;
భ్రమ మనముచేయునారోప ♦ ణములెకాని,
వానిమానిన నానంద ♦ వార్ధి దొఱకు;

పోతు:—నాకుఁ గాలిమీఁదఁ బుద్ధిపుట్టి బాధించుచున్నదనుకొండు. అది నాయారోపణమైయైనచో, దానిని సుఖమనికూడ నారోపణము చేయఁగలనా ?

గోవిందమ్మ:—నాయనా! నిలకడతో నాలోచింప వలయునుసుమీ! మనస్సున స్ఫురించిన ప్రశ్నములనెల్లవేసిన లాభ మేమియు నుండదు.

పోతు:—నేనే ప్రశ్నమడిగినను ఇట్లే యాక్షేపింతురు. మఱల శ్రవణము, మననము, నిధిధ్యాసనము, ననుచుందురు.

గోవిందమ్మ:—కోపగింపకుము తండ్రీ! శ్రవణమునకుఁ దోడుగ మననమునుగూడ నభ్యాసము జేయుమనియే నేను చెప్పునది.

ఓంకా:—తమ్ముఁడా! విన్నదానినెల్ల నాచరణలోఁబెట్టి పరిశోధింపవలయును సుమీ!

పోతు:—మీరందఱును విన్నదాని నాచరణలోఁ బెట్టినతరువాత నే నాకు నేర్పవచ్చును లెండు. నేఁబోయెదను. (పోవును)

గిరి:—తమ్మునకుఁ గోపము మీఱిపోవుచున్నది. నేనుపోయి శాంతింప జేయుదును.

వీ. నా:—నాయనగారు చెప్పుమాటకు నిదర్శనమిదియే. చిన్నన్నకుఁ గోపమురాఁదగిన యంశమేదియు లేదు. కోపము వాఁడెమనేసో, దానిని సహించుసాధన చేసినయెడల, మఱి శ్శాంతి ననుభవింపఁ గలఁడుగదా.

గోవిందమ్మ:—అదెవరివశము.

వీ. బ్ర:—పోతులూరయ్యకుఁ బ్రారబ్ధవశముచేతఁ గోపవాసన యేర్పడినది. దానిని ప్రియవచనములచేత శాంతిపఱుపవచ్చును. అతఁడును దనకుఁ బ్రియులగువారిచెంతనుండి, వారిపలుకు లాలకించుచో వానికోపము వ్యయమైపోయి, ప్రసన్నుఁడు కాఁగలఁడు. అమ్మా! వీరనారాయణమ్మా! నీవునుబోయి చిన్నన్నను శాంతిపఱుపుము. (వీరనారాయణమ్మ వెడలును.)

ఓంకా:—నాకొక యుపాయము తోఁచుచున్నది. అమ్మాయి నత్తవారింటికిఁ బంపుటకై ఆయత్తపఱచిన వస్తువుల నన్నిటినిఁజూపి, వానిని ప్రియభాషణములలోనికి దించెదను. ఆసుపై వాని ప్రేమ మున్నతము. (వెడలును)

సిద్ధు:—ఇదియదను. నేనెదుటికిఁ బోదును. తండ్రీ! జగద్వంద్యా! కరుణాసాగరా! నమస్కారములు.

వీ|బ:— ఎవరునాయనా నీవు?

శివ:—ఎవరయ్యానీవు? కొంచెము దూరముగ నుండఁదగదా?

సిద్ధ:—నే—నే—ను.

గోవిం:—నీవు నీవుగాక వేఱొకఁడ వగుదువా? నీదేకులము?

సిద్ధు:—కు-లము-మా-కెందు-కు లెండీ!

శివ:—కులశీలములు తెలుపనివాఁడు పూజ్యులచెంతకుఁజొచ్చెర దుము కఁగానెట్లూరకుంట?

సిద్ధు:—కరుణిం-పుఁడు.

శివ:—నీవెవరవో చెప్పవేమి?

గోవిం:—చెప్పుటకు వెఱచియేగదా యిట్లుచేయుట. ఓరీ! మ్లేచ్ఛవర్తనా! సరియగు సమాధానము వచింపవేల?

సిద్ధు:—కోపము—చేయకుఁడు. దయ—చూఁడుఁడు. నోట—మాట-రాకున్నది.

శివ:—ఇన్నిమాటలు రాఁగా, కులముపేరు నాలుగక్షరాలు రావు?

వీ|బ:—బిడ్డా! శాంతచిత్తుఁడవుగమ్ము. ఈయావేగమెందులకు?

గోవిం:—వీనినిజూడ నాకనుమానము కలుగుచున్నది.

సిద్ధు:—మీపాదా—లాన—అనుమానా—లకుఁ—దగినవాఁడను—గాను.

గోవిం:—నీకులమేమి?

సిద్ధు:—దూ—దే—కు—ల—

శివ:—ఏమేమి? దూదేకులవాఁడవా? అయ్యయ్యో! ఇంటిలోనికిఁ జొరఁబడితివే. మహనీయులు, పావనమూర్తులు, మాతండ్రిగారిని సమీపించితివా?

సిద్ధు: — పతిత—పావనులు—వారు.

గోవిందమ్మ: — కాఁబట్టి దూరముగ నుండుము. ఆగడపదాఁటి నిలువుము.

సిద్ధు:—దప్పి—గొని—వచ్చినాను.

శివ:—అటులనే దాహమిచ్చెదము. అటుపొమ్మ.

సిద్ధు:—ఆఁకోని—ఉన్నాను.

గోవిం:—దాహము తీర్తమన్న, ఆఁకలియా ? అది తీర్చిన నేమికావలయునో? పద ! పద ! కొంచెమన్నము బెట్టించెదములే.

గోవిందమ్మ:—పాపము! కడునీరసముగా నున్నాఁడు. తినుట కేదేనియుఁ గొంచెము కొని తెత్తును. (వెడలును)

సిద్ధు:—నాయాఁకలి—కడుపుది—గాదు. నాదాహము-నాలుకది—గాదు.

శివ:—ముందు దూరముగఁ దొలఁగుము. చిత్రిపరిసంగము సాఁగుచున్నది. నీకేమి కావలయును ?

సిద్ధు:—దర్శనము.

గోవిం:—ఎవరి దర్శనము ? నాయనగారి దర్శనమా ? చూచితివి. ఇఁకఁబొమ్మ ! లెమ్మ !

సిద్ధు:—బ్రహ్మ — దర్శనము.

గోవిం:—బ్రహ్మముగారు వీరే! ఇఁక లేచిపొమ్మ.

సిద్ధు:—అదిగో ! మాయమ్మ వచ్చుచున్నది. మ్రొక్క—కొనెదను.
(గోవిందమ్మ కొన్నిరొట్టెలను గొని తెచ్చును. బ్రహ్మముగారు నవ్వుచుందురు.)

సిద్ధు:—అమ్మా! అమ్మా! మాతల్లీ! నమస్కారములు.

గోవిందమ్మ:—లెమ్మ! ఈయన్నముఁ గొనుము.

సిద్ధు:—నాకాఁకలి లేదు తల్లీ!

గోవిందమ్మ:—ఓరీ! ఆఁకొంటినంటివి. అన్నము తెమ్మంటివి. ఇప్పుడాఁకలి లేదందువే! పిచ్చివాఁడవా యేమి ?

సిద్ధు:—తల్లీ ! నాపిచ్చినాయనగారు తీర్చెదరు. కరుణించి చెప్పుము.

శివ:—నీపిచ్చి నేను గుదుర్చుదునా ?

వీ॥ బ్ర:—వేగిరపాటు చేటు దెచ్చునండ్రు. వానిభావమేమో తెలిసి కొనుడు.

శివ:—మీరునచ్చిన కొలఁదిని వీనియాగడము హెచ్చును. అసలే మొండివాఁడుగనున్నాఁడు.

సిద్ధు:—మొండితనము లేక బ్రహ్మదర్శనమబ్బునా ?

గోవిం:—నిజము. ఐనను బింజారులకు బ్రహ్మదర్శనమేల ?

సిద్ధు:—రోగముకలవానికిఁగదా మందుగావలయును? రోగము గొప్ప దైనకొలఁదిని ఘనౌషధములు కావలయును. నాయదిసామాన్య రోగముకాదు. భవరోగము!

శివ:—నీకేయౌషధము కావలయును ?

సిద్ధు:—జ్ఞానామృతము.

గోవిం:—ఓహోహో ! బ్రహ్మకులమునఁబుట్టి, త్రిమూర్త్యాత్మకుఁడని పేరుగాంచిన వీరబ్రహ్మేంద్రగురుని తనయులమై, సదాశ్రీవారి సుబోధలనాలకించుచుముబోంట్లకు, జ్ఞానమననేమో? గ్రహించు టకే శక్యముగాకున్నదే ! నీవా ! దూదేకులవాఁడవా ! దానిని గ్రహించుట ?

వీ॥ బ్ర:—బిడ్డలారా ! అట్లనకుఁడు. తనయులైనమాత్రమున నందఱు గ్రహింపఁజాలుదురా ?

తే॥ గీ॥ నీటనేపుట్టుఁ గప్పలు ♦ నీరజములు;
కాని తమ్ములవలపు భే♦కములలేదు;
తమకులేకున్న సయిదోండ్ల ♦ తావినైనఁ
గ్రోలఁగాఁజాలవవి; సోద♦రులును నిట్లె;

సిద్ధు:—చిత్తము, చిత్తము.

శివ:—వీనికేదియో తెలిసినటుల నటించుచున్నాఁడు. శ్రీవారివాక్యా లయర్థము వీనిబోంట్లకెట్లు తెలియును?

సిద్ధు:—ముందుగ వారియనుగ్రహమునకుఁ బాత్రులముగావలయును.

గోవిం:—హఠముచేతనా ?

సిద్ధు:—హఠము కొన్నిట వాంఛనీయమే.

శివ:—వీనిహఠము దుర్భరము.

గోవిందమ్మ:—నీపేరేమోయి ?

సిద్ధు:—నాపేరు సిద్ధుఁడు.

గోవిం:—సిద్ధుఁడవా ? పక్వదశవచ్చినదా ?

శివ:—వీఁడు దేనికైన సిద్ధముగనున్నవాఁడే.

(పోతులూరయ్య ప్రవేశించుచు.)

పోతు:—తండ్రీ ! మన వీరనారాయణమ్మ కరణమిచ్చుటకై మంచికపిల గోవుల సిద్ధముచేసినాను [సిద్ధునిజూచి] ఈతఁడెవరు ?

గోవిం:— ఈతఁడు పింజారిపోఁడు. ఇతనికి జ్ఞానోపదేశము కావలయునఁట! సమీపమునకు రావలదనినకొలఁదిని దండ్రిగారి పాదములదాఁక వచ్చుచున్నాఁడు. పొమ్మన్నను వదలుటలేదు.

పోతు:—అటని నాయనిగదా; క్షణములో నావలకుఁబంపెదను. లేకున్న యమాలయమునకే బంపెదను. (నడుముకట్టును)

గోవిందమ్మ:—నాయనా ! తొందరపడకుము. దయాదాక్షిణ్యములు లేక వర్తింపఁదగదు.

సిద్ధు:—అటులజెప్పుము, తల్లీ ! తల్లీ ! ఆమాటలు గట్టిగఁజెప్పుము. జగజ్జననీ ! మాతండ్రితోఁ గరుణచూడుమని మనవిఁజేయుము. నేనునీబిడ్డను. కాపాడుము. మొ్రొక్కెదను. (సాష్టాంగపడును)

గోవిందమ్మ:—నాథా! యుక్తిచేవీనికిహితబోధఁజేసియావలికనుపుఁడు.

గోవిం:—హితబోధలకు వశుఁడు గాఁడు.

శివ:—యుక్తులు సాఁగవు.

పోతు:—నాయుక్తియే యుక్తి.

(పీరుసాహెబు ప్రవేశించును.)

పోతు:—ఇంకొకసాహెబు పరుగుపరుగునవచ్చినాఁడే!

పీరు:—నేను వీనితండ్రిని. పీరుసాహెబనువాఁడను.మీరు హిందువులు. మేము ముసల్మానులము. మతములు భేదములు. ఏమతమును మతభ్రష్టులమన్నింపదు. వీనినిటుల మీాపరప్పించుట న్యాయము

గాదు. కోరా!- నన్నును మార్చుచున్నారు. ఇట్టి యింద్రజాలములు, మాయలు, ధర్మముగాదు. వీనినిటుల రప్పింపకుడు.

శివ:—వీనిని రప్పించినదెవరు?

పోతు:—పొమ్మని వెడలందరుముచున్నను బోకున్నాడు. వీనిని గొని పొమ్ము! మాకును బీడవదలును.

గోవిందమ్మ:—కుమారులారా! మీరుపోయి మీపనులను జూచుకొనుడు. సిద్ధునివిషయమై తండ్రిగారాలోచింతురు.

పోతు:—వీనికిమాత్రము జ్ఞానోపదేశము చేయఁదగదు. (గోవిందయ్య, శివరామయ్య, పోతులూరయ్యయు, నిష్క్రమింతురు.)

వీరు:—అయ్యా! బ్రహ్మముగారూ! వీనిని బొమ్మని చెప్పుఁడు.

వీ॥బ్ర:—నేను రమ్మంటినా, పొమ్మనుటకు?

వీరు:—సిద్ధా! వింటివా? వారు నిన్నేమియు రమ్మని పిలుచుటలేదు. పోవుదము పద.

గోవిందమ్మ:—అబ్బి! నామాటవిని మీతండ్రియింటికిఁ బొమ్ము.

సిద్ధు:—మాతండ్రియింటికేవచ్చితిని. తల్లీ! భ్రమపెట్టఁజూడకుము.

వీరు:—వీనికి దయ్యము పట్టినది! అయ్యా! బ్రహ్మముగారూ! కొంచెము మంత్రించి బూడిదపెట్టి పంపుఁడు.

వీ॥బ్ర:—వీనికి విభూతి నొసఁగుమందువా?

వీరు:—అవును తండ్రీ! అవును.

సిద్ధు:—తథాస్తు!

వీ॥బ్ర:—సిద్ధా! నీ కోరుజ్ఞానము ఆతురపాటుచే లభించునదికాదు. ఆకులపదువాని చెంతనుండి యది దూరముగఁ బాఱిపోవును.

తే॥ గీ॥ కలకలం బెంత వెలుపలఁ ♦ గలుగుచున్న
నోర్పుమై నంతరంబున ♦ నుండవలయు;
మనసె మెలకోఁతి, యది త్రిప్పు ♦ మమతఁదిరుగు
వాఁడెటుల జన్మసంసిద్ధి ♦ వడయనేర్చు?

ఇంతియే గాక—

తే। గీ॥ కడఁగి తొలిజన్మచిత్తసం♦స్కారమెవ్వఁ
డెటులఁ బ్రాప్తించుకొని పుట్టు ♦ విందఁగనునో,
దాని కనుకూలముగఁ బ్రవ♦ర్తనము వలయు;
నితరగతిఁబోవ ఫలసిద్ధి ♦ యెటుల వచ్చు ?

పీరు:— విను విను, బాగుగ విను.

సిద్ధు:—చిత్తము గురువరా! అట్టిసంస్కారముల కనుగుణముగఁ బోనీక వీరు నన్నడ్డుచున్నారు. ఏమిచేయుదును.

వీ॥బ్ర:— పర్యవసానమున నేవియు నాటంకములుగావు. అన్నియు సాధనము నకుఁదగు నుపకరణములే. బాధకములుగఁ గాన్పించు ఘటనలే జయమును గూర్చును.

తే। గీ॥ ఎంతటి నిరోధములఁ దాఁట ♦ నంతఘనమ
యగును; దుదకెట్లుఁబటువిజ♦యంబె గలుగు;
నరుగఁదీయక గంధము ♦ నందఁగలరె ?
గాఁ్రిలునే సాననిడక వ♦జ్రములు సిద్ధ !

కావున

తే। గీ॥ కష్టములఁగూర్చి మొఱవెట్టి ♦ కలఁగునరుఁడు
తిరిగి పరమార్థమెపుడు బ్రా♦ప్తించుకొనఁడు;
ఓర్పుమెయి వానినెల్లను ♦ నోర్చువాఁడె
మొనయువీరుండు ధీరుండు ♦ ముక్తుఁడగును;

పీరు:—వీని కేకష్టాలు లేవండి. కాసైన సంపాదింపకున్నను, పోషణ జరుపుచున్నాను. పెండ్లికూడఁజేయుటకుఁ బిల్లనుగుదిర్చినాను. వీని కేమి చేటో, ఇట్లైనాఁడు.

సిద్ధు:—(చెవులుమూసికొని) పెండ్లామునుగట్టి సంసారసాగరమునఁబడ వేయుటకన్న, మెడకొక ఱాయిగట్టి సముద్రమునముంచరాదా? ఇట్టివారేనా తండ్రులు ?

వీ। బ్ర:—నీవు పొరపడుచున్నావు. లోకమునకాధారమే గార్హస్థ్యము. దానిని నిందింపకుము. వినియోగములఁబట్టి యేదేని శుభాశుభములఁ గూర్చుచుండును. దుర్వినియోగము చేసినచో నన్న

మే విషముకాఁగలదు. సద్వినియోగముచేసినచో విషమనునది యే లేదు.

పీరు:—అటుల సెలవీయుఁడు. వీనికై పిల్లను గుదిర్చియున్నాను. పిల్లవైపు వారు నన్ను నిందించుట యింతింతనిగాదు. నాయుపేక్షయే వీనియున్మాదమునకుఁ గారణమనుచున్నారు

వీ॥బ:—సిద్ధా! నీవిప్పుడింటికిఁ బొమ్ము. పెండ్లి చేసికొనుము.

పీరు:—పెండ్లిచేసికొనినచో నీపిచ్చినిమిషములో నిర్మూలముకాఁగలదు.

సిద్ధు:—కటకటా! పెనముచుండి యెగిరి ప్రొయ్యిలోఁబడినట్లగునా యేమి!

పీరు:—త్వరగాఁబంపుఁడు. ఇంటికడ వీనితల్లియవస్థ మహాఘోరముగ నున్నది. ఈతఁడు రాఁడేని ఆమెబ్రతుకదు.

గోవిందమ్మ:—సిద్ధా!

తే॥ గీ॥ జనని దుఃఖముపాల్సేయు ♦ తనయులకెటు
ప్రాప్తమగుఁబర, మిహధర్మ♦పథమువిడుచు
టర్హమే? పరసాధన♦మైహికంబు
గాదె? యారెంటవైరంబు♦లేదు నిజము;

మఱియు స్వర్గనరకములలోనున్నవారు పరసాధనము చేయుట కవకాశము లేదు. ఇహమున నేసుమీ! బ్రహ్మదర్శనమును సాధించునది.

సిద్ధు:—తల్లీ! నీమాటలు నాకర్థమగుట లేదు.

పీరు:—ఏవేవో, తరంగాలు, తత్వాలు, చదువుదువే?

సిద్ధు:—ఎవరోరచించినవి; ఎవరోపాడుకొనునవి; హృదయతాపము చల్లారునిమిత్తము చదువుచుందును. అంతియేగాని, వానిసారము నాకుఁదెలియునా? గురుపాదసేవలేక సారముగోరిలుటసున్న!

పీరు:—వీనిని త్వరగఁబంపుఁడు.ఇంటికడఁదల్లి ప్రాణావశిష్టయై యున్నది.

వీ॥బ:—సిద్ధా! సత్వరము పొమ్ము.

సిద్ధు:—కటకటా ! ఏటిమాటలివి? నన్ను మీరనుగ్రహింపరా? ఇక నాకుగతియేమి? హరహరా ! ఈయుత్తరీయమునఁ గుత్తుక బిగియించుకొని, ప్రాణములఁబాసెదగాక. (అట్లుఁజేయఁబోవును)

గోవిందమ్మ:—సిద్ధా ! తొందరవలదు! నామాటాలకింపుము.

సిద్ధు:—చెప్పుము తల్లీ! చెప్పుము !

గోవిందమ్మ:—ఆత్మహత్య అధోగతికి మూలమని యెఱుఁగవా ?

సిద్ధు:—తల్లీ ! ఎఱుఁగుదు. పొరపడితి, క్షమింపుము. నీపాదముల శరణు జొచ్చెద. తరించుత్రోవఁ జూపుము.

గోవిందమ్మ:—నాథా ! వీనితీవ్రభక్తి తృణీకరింపఁదగినదిగలేదు. వీని ననుగ్రహించి శాంతిఁగొలుపుఁడు.

వీ|బ్ర:—సత్యదర్శనముగాక వీనికి శాంతి నొడమదు.

పీరు:—నిజము నిజము. సత్యమునుబోధించి సత్వరము పంపుఁడు.

సిద్ధు:—తథాస్తు ! తథాస్తు ! సత్యబోధ యొనర్పుఁడు !

వీ|బ్ర:—ఎల్లిశివరాత్రి. నేఁడు నీవింటికిఁబొమ్ము. మీయమ్మను సమ్మతింపజేసి రేపు స్నాతుఁడవైరమ్ము. నీకుఁగొంత జ్ఞానప్రసాద మిచ్చెద.

సిద్ధు:—అది పొసఁగునా? నాతల్లి సమ్మతి యొసఁగునా ?

వీ|బ్ర:— ఈపాటి విశ్వాసము పూనఁజాలవా ?

సిద్ధు:—మారుమాటాడను. ఇదిగో పోవుచున్నాఁడను.

పీరు:—అమ్మయ్యా! బ్రతికిపోయినాము. (తనలో) ఇంటికివచ్చిన పిన్నమ్మట వీనితరమా తిరిగివచ్చుట.

సిద్ధు:—(నడచుచు) ధన్యుఁడను, ధన్యుఁడను, నేఁటికిధన్యుఁడనైతిని. అయ్యో! ఏదిధన్యత ? ఇంటికిఁ బొమ్మనెఁగదాగురుఁడు. అమ్మ యేమిపాశముల వేయునో? ఛీ. ఛీ. విశ్వాసము పూనుమని గురువుసెలవిచ్చెనుగదా ! నేనింకసందేహించుట నీతియా? తగదు, తగదు—మనసా ! నీవెంత గడుసుదానవే? ఎన్నితిరు

గుల్లుపెట్టుచుంటివి ? నిమిషములో ఆశ. నిమిషములో నిరాశ. క్షణములో విశ్వాసము. తృటిలో అవిశ్వాసము అయ్యో! నిన్నాశ్రయింపక గతిలేదు. నీవేలోకమున శత్రువవు. నీవే మిత్రమవు. నీకునమస్కారము. నాకడ్డురాకుము; నన్ను తిప్పలం బెట్టఁబోకు, నాగురు నాన నీకు.

పాట॥ గురుని దయ గల్గెఁ, నాపై, స
ద్గురుని కృప వొడమెఁ॥ గురు॥
నిరుపమ నిర్గుణ నిత్యకల్యాణా
న్వితమగు మోక్షము నికఁగనుగొందుఁ॥ గురు॥
మదిలోఁజింతలు మాయమై చనెఁ;
పొదలెను శాంతము, పూర్ణానందము;॥ గురు॥

(తెరపడును.)

ఇది పంచమాంకము.

# బ్రహ్మానందలీలలు

## షష్ఠాంకము.

### మొదటి రంగము

(పలుగురాళ్ళపల్లె. కరణముఇల్లు—కరణము గోవిందయ్య, మోతాదు నరిసిగాండ్రు, ప్రవేశింతురు.)

కర:—నరిసిగా! అన్నియూళ్ళలోను సిస్తులు వసూలైనవి. మనయూరొక్కటే వెనుకంబడియున్నది.

నరి:—సిత్తమండి. రేపటా మాపటా, అడిగొత్తూ నేవుండాగా దొరా.

కర:—ఏమిలాభము? ఇంకను మూడువందలు వసూలుకావలెను. ముఖ్యములలోఁ బింజారులు చాలమంది సిస్తులీయలేదు.

నరి:—దొరో! ఆళ్ళంతా వూళ్ళొంబడెళ్ళారు. ఆళ్ళకేముంది, దూదేకనూ, పరుపులుకట్టనూ, దేశాల్మీద పడిపోతారు.

కర:—వాఁడెవఁడు? అటుపోవుచున్నాఁడు.

నరి:—ఓ! ఆయ్నుండీ, పీరుసాయిబుకొడుకు. పిచ్చిసిద్దప్పంటారే! ఆయ్ను!

కర:—పీరుసాహెబుకూడ సొమ్ముకట్టలేదు. వానిని బిలుచుకొనిరమ్ము.

నరి:—సిత్తందొరో!—ఓసిద్దప్పయ్యగారో, ఓహో! రండి, రండి! కర్నంగారు పిలుత్తుండారు.

(సిద్ధప్ప ప్రవేశించును.)

సిద్ధ:—పాట॥ ఇదిగోర! గురుకీలకం జీవ! వినరా,
అల్లదిగోర! యోగసాధన॥ ఇది॥
ఇదిగోర! గురుసపాదం, నీ
హృదయములోపల వదలక తలఁచరా॥ ఇ॥
కొండమీఁద పెద్దగుండు యున్నదిరా,
గుండులోసన్నంపు గండియున్నదిరా,

ఆ, గండిలోనొకపండు పండియున్నదిరా,
పండనుభవించితె "ప్రజ్ఞానమేబ్రహ్మ॥ ఇ।

ఆహా! హా!

నరి:—నీపాటాపయ్యో! అడుగో కర్ణంగారు.

సిద్ధు:—ఇదిగోర! గురుకీలకం, జీవవినర!
అల్లదిగోర! యోగసాధనం॥ ఇ।

కర:—సిద్ధప్పా! ఏది, మీరుసిస్తు కట్టలేదే?

సిద్ధు:—ఇదిగోర! గురునిపాదం—

కర:—ఛీ. నేను సిస్తు తెమ్మన్న, గురుపాదమును జూపుదువు?

సిద్ధు:—హృదయములోపల వదలకదలంచర! ॥ ఇ॥

కర:—నన్నుగూడ ఆపాదాలు పట్టుమనుచున్నాఁడు? ఎంతపొగరు?

నరి:—యేమయ్యో! సిస్తేది?

సిద్ధు:—ఇదిగోర! గురుకీలకంజీవవినరా॥

కర:—వీఁడు బలేటక్కరి. పిచ్చివాఁడుకాఁడు. ఇది గురురుకీలకమఁట. సొమ్మొగవేయునుపాయమఁట.

సిద్ధు:—అల్లదిగోర! యోగసాధనం।

కర:—నాదగ్గఱఁగూడ మంచిసాధనమే యున్నది. నీకంటె కీలకములు నాకు బాగుగఁ దెలియును—నరిసిగా! కాళ్ళుసేతులంటఁగట్టి యెండలో నాబండమీఁదఁ బడవేయుము. ఎవఁడు వచ్చునో చూచెదము. (కట్టివేయుదురు) ఇఁక వీనియబ్బవచ్చునో, లేక వీనిగురుఁడు వచ్చునో!

సిద్ధు:—గురుఁడా? ఏఁడీ? ఏఁడీ? నాగురుఁ డేఁడీ? నాతండ్రియేడి? బ్రహ్మం, బ్రహ్మం, వచ్చెనా? వచ్చెనా? ఆహా! హా! ఆ వెలుఁగేమి? ఆవెలుఁగేమిరా?

(తన్మయుఁడై యుండును.)

కర:—ఓరీ! నరిసిగా! నేను చెప్పువఱకు వీనికట్లు విప్పకు. ఏడ్చినను సరియే! చచ్చినను సరియే!

నరి:—సిత్తం, దొర!

సిద్ధు:—ఛూ, ఛూ, హుూత్ !

కర:—వీఁడు నిజముగఁబిచ్చివాఁడే. ఇట్టి పిచ్చలు పెండ్లితోఁగుదురునవి కావు.

నరి:— ఆపిల్ల అదుట్టం యేంటో ! ఎట్లుందో !

కర:—ఎట్లుండిన నీకేమి ! నాకేమి ?

నరి:—దొరో ! యీయన్న యెట్లాపడుండాడో సూడండి. సత్తాడేమో ;

కర:—చచ్చిన భూమికిఁ గొడవగునా ?

నరి:—పాపం గాదండీ దొరా !

కర:—వీఁడు కేవలము పిచ్చివాఁడు కాఁడురా; టక్కరినలెనున్నాఁడు. చావఁడులే-అటుచూఁడు. మన పసువులు పరుగెత్తుకొనుచు వచ్చినవి.

నరి:—ఔనుదొరో, కమతగాళ్ళు లేరు.

కర:—వాళ్ళకు మదము హెచ్చిపోయినది. నీవుపోయి గొడ్లనుగట్టివేసి రమ్ము. ఇంతప్రొద్దుండఁగనే గొడ్లను మఱలించినారు. దండించెద మని వెఱచి యిటకు రాలేదు.

నరి:—గొడ్లుదొడ్లోకి పోతుండైలెండి— అగ్గో, అగ్గో. కమతగాళ్ళు ! ఇంకాపసుల్ని మళ్ళేసుకొత్తుండారు.

కర:—వాండ్రనిటు లాగుకొని రమ్ము.

(నరిసిగాఁడు వెడలును)

(శేషిగాఁడు, కేశిగాఁడు, రొఁజుకొనుచుఁ బ్రవేశింతురు)

శేషి:—దొరో, దొరో,

కర:—ఏమిరా?

కేశి:—దొరో దొరో, మఱిగత్తే—

కర:—ఏమిరా?

శేషి:—కేశిగా! సెప్రా.

కేశి:—నూవుసెప్రా.

శేషి:—నాకుమాట్రాటలా—(పడిపోవును.)

కేశి:—నాకూ - అంతే.

కర:—ఏమిరా? వానికేమైనఁ బాగుకఅచెనా?

కేశి:—పు-పు-పులండి!

కర:—పులి కఱచినదటరా?

శేషి:—అ-అ-అవుందొరో!

కర:—వచ్చినారు దొంగవెధవలు.

కేశి:—అణ్ని కాదండి.

కర:—ఏమిరా? త్రాగివచ్చితిరా?

కేశి:—క్కఱిసిందండి.

కర:—ఎవరినిరా?

కేశి:—మెల్లావునండి.

కర:—ఎల్లావునా? ఎల్లావునా? (లేచి యిటునటుతిరుగుచు) సరిసిగా, సరిసిగా!

కేశి:—ఆడట్టా యాడకో పోయాడండి దొరో.

కర:—పదపద, తుపాకి సాహెబును బిలుచుకొని రమ్ము.

కేశి:—దొరో! సాబెందుకు?

కర:—వెధవా! చెప్పినట్లు చేయుము.

కేశి:—యిడిసేసిందండి!

కర:—ఆవేదిరా?

కేశి:—వొచ్చిందండి.

కర:—పులివచ్చినప్పుడు మీరెక్కడ నున్నారు?

కేశి:—ఆడేమో పారొచ్చేడు.

కర:—నీవో?

కేశి:—నేనే సెట్టెక్కా.

కర:—ఏడవక పోయినావు?

కేశి:—యేడ్సానండి!

కర:—ఎందుకు? పొగరెక్కియా?

కేశి:—సెట్టు జారిపడ్డాగా.

కర:—పులి నిన్ను మ్రింగలేదా?

కేశి:—లేదండి. దేవుడు మింగని త్తేగా.

కర:—నీకు భక్తి ముదిరినదికాంబోలు ? దేవుఁడు కనఁబడెనా చెట్టు నుండి పడఁగనే ?

కేశి:—అవునండి, దేవుడల్లేనె—వొచ్చేడు.

కర:—ఎవరురా ?

కేశి:—పిచ్చిసిద్దయ్యండి దొరో !

కర:—ఛీ ! వెధవా ! అన్నియుదొంగకూఁతలవలె నున్నవి.

కేశి:—'ఘూ, ఘూ' హూాత్,—అన్నాడండి.

కర:—చిత్రముగానున్నదే ? సిద్ధప్ప యిక్కడనే యున్నాఁడుగదా ?

కేశి:—యేడండీ?

కర:—అటుచూఁడు.

కేశి:—అదేంటండీ ! అన్నాయం ! వుపకారంచేసినోడికి, అపకారాలండీ దొరా ?

కర:—ఇతఁడక్కడికెట్లు వచ్చెరా ?

కేశి:—యీాయనేనండి, నాసత్తెంగా యీాయనే !

కర:—ఏమి చేసినాఁడు ?

కేశి:—పెద్దపులొచ్చింది. గొడ్లన్నీ సెదిరై.మాకుపానాల్లో పానాల్లేవ్. ఆడు పారోప్పోయి పడ్డాడు. నేనుసెట్టెక్కపోయి పడ్డాను.

కర:—తరువాత ?

కేశి:—సిద్దయ్యగారొచ్చారు. ఘూ ఘూ హూాత్, అని పిల్లిన్తోల్నట్లు తోలాడు.

కర:—ఆవో ?

కేశి:—కొట్టికేదే ! పడేసింది, గోళ్ళతో గీకింది.

కర:—పద, చూడవలయును. బ్రితుకునా ?

కేశి:—సిద్దయ్యగారొచ్చి దాన్నెగదీశాడు. సెయ్యేసాడు! నెత్తురుకూడా కట్టింది !

కర:—ఏదీ ? ఎక్కడనున్నది, ఆవు ?

కేశి:—దొడ్లో. సక్కంగలగెత్తివొచ్చిందిగా. సిద్దయ్యగారు పులెంట

బడ్డారు. ఎప్పుడొచ్చాడో మళ్లీ!

కర:—కటా! నేనెంతమూర్ఖుఁడను. ఈతఁడు మహానుభావుఁడు. (పరుగునవెళ్ళి సిద్ధునికట్లు విప్పి) మహానుభావా! క్షమింపుము. అజ్ఞానిని. దోషిని. నీపాదములకు మ్రొక్కెద.

సిద్ధు:—లెండు, లెండు! మీకమతగాండ్రు క్షేమమా?

కర:—ఏమట్లు ప్రశ్నింతురు?

సిద్ధు:—నేను పులివెంటఁబడి చాలదూరము పోయినాను.

కర:—నేనెంతయు నపరాధిని. అధికారగర్వాంధుఁడను. నీపాదములు పట్టినాఁడ, రక్షింపుము.

సిద్ధు:—సోదరా! అంతయు గురుకృప. మీరగ్రకులజులు. నన్నంట రాదు.

కర:—అట్లనఁదగదు. నీపాదరజమునకుఁ బోలను.

సిద్ధు:—బ్రహ్మతేజము మీలో వెలుఁగుచుండును. కండ్లు లోనికిఁద్రిప్పి చూడుఁడు. దానిని గుర్తింపక, నేనునీచుఁడ, నేనల్పుఁడ, ననుట, ఆత్మద్రోహమగును.

కర:—ప్రభూ! ఆదృష్టి నాకెక్కడిది?

సిద్ధు:—ఆనేత్రమందఱకును గలదు. సాధనముచేసినఁ దెలియవచ్చును.

కర:—ఆసాధనమెట్టిది? నాకును లభించునా?

సిద్ధు:—సాధనమనేకవిధముల నుండును—నిష్కామకర్మము నవలంబించి, ఇంద్రియానీకము తమతమ సహజకార్యముల వర్తింపుచుండ, మనస్సును వానినుండి లాగివేయవలయును. అట్లులమఱలించిన మనస్సును, భగవంతునిపై హత్తింపవలయును.

కర:—ఇది సాధ్యమా?

సిద్ధు:—దూరాన నాడుకొనుబిడ్డపై నేత్రదృష్టిని గట్టిగా హత్తించి వక్షమందుంచువనితల మీరెన్నఁడును చిలకింపలేదా?

కర:—చూచితిని.

సిద్ధు:—వారట్లు అన్యమనస్కలై దంపుదంచినను, గాళ్ళపైరోఁకలి పడదు. బియ్యము చక్కఁగ మెదుగును.

కర:—నిజమే!

సిద్ధ:—ఇది సాధనముచే లభించునదే! మీరు కరణములు, ఉద్యోగులు; మీరువారి మార్గమునవలంబించి, మనిని భగవదధీనము చేసి యుద్యోగకార్యములందు క్రియములఁ బ్రయోగింపుఁడు.

కరం:—చిత్తము! నన్ను క్షమించి సెలవిడువుఁడు. నబాబుకడకుఁ బోవలయును. నాయపరాధము మన్నింపుఁడని మఱొకసారి ప్రార్థన మొనర్చుచు నమస్కరింతును.

సిద్ధ:—సర్వము గురుమహాదేవుని యనుగ్రహము! నాకును బోవలసియున్నది. మీరు నిలువుఁడు. (నడచుచు)

తే. గీ. తనువుమీఁదమమత్వంబు ♦ దనరనీక
మనసు గురుదేవునందున ♦ మలయఁ జేసి,
నిత్యసంతుష్టుఁడైన వా♦నికి నసాధ్య
మున్నె? కష్టాలు దను జుట్టు ♦ కొన్నఁ గాని;

పాట। గురునిమహిమ వర్ణింపఁగనలవియె ?
సరసిజభవరుద్రాదులకున్ ... ॥గురు॥
కరుణాపూర్ణుఁడు, పరమపూరుషుఁడు,
నిరతసత్యగణ నీయ చరిత్రుఁడా ॥గురు।
ఘోరమైన సంసారవనధిదరి
జేరఁజాలెదు శ్రీగురుచరణమె ॥గురు।

(నిష్క్రమించును.)
(తెరవ్రాలును.)

రెండవరంగము.

(పుష్పగిరిత్రోవ. భీమావధానులు. సిద్ధుఁడును, బ్రవేశింతురు.)

భీమా:—ఎవరోయీతనిది ? మాపుష్పగిరికి వచ్చుచున్నాఁడు! ఓహో! పిచ్చిసిద్ధప్పవీఁడు. వీనితోఁగూడి, వేడుక సలుపుదుఁగాక!

సిద్ధ:—(పరధ్యానముగా)

పాట॥ ఏయూరయ్యా ! మీదేయూరు ?

భీమా:—ఏయూరయ్యా ! మీదేయూరు ?

సిద్ధు:—కందిమల్లయపల్లె మాయూరు,
కాలకర్మాలు బాపును మాయూరు;

భీమా:—ఏయూరయ్యా ! మీదేయూరు ?

సిద్ధు:—కర్మజీవులకెల్ల మాయూరు, అంధ
కారమైయుండును మాయూరు;

భీమా:—ఏయూరయ్యా ! మీదేయూరు?

సిద్ధు!—కర్మములు తెగితేను మాయూరు,
పండువెన్నెలైయుండును; మాయూరు ॥ ఏ॥

భీమా:—ఇంకఁజాలునుగాని, నీవెక్కడికిఁ బోవుచున్నావు ?

సిద్ధు:—నన్నెఱుఁగుదురా?

భీమా:—నిన్నెఱుఁగనా ? పిచ్చిసిద్ధప్పవు! నీవెక్కడకుఁబోవుట?

సిద్ధు:—మాగురువుగారు శిష్యసమేతముగఁ గడపనగరము పోవుచున్నారు. నన్ను ముందుగాఁ బంపియుండిరి. కొంచెపిసేపటికి వారును రాఁగలరు.

భీమా:—మీగురువెవరు ?

సిద్ధు:—ఎఱుఁగరా ? లోకైకగురువరుండు శ్రీపోతులూరు వీరబ్రహ్మేంద్రస్వాములవారిని !

భీమా:—ఓహోహో! కందిమల్లయపల్లెలోని వీరప్పయేనా? బత్తుఁడు కాఁడూ ?

సిద్ధు:—భక్తవరులకునయిత మారాధనీయుఁడగు దేశికోత్తముఁడు.

భీమా:—సరి, సరి ! గురునకుఁదగినశిష్యుఁడవు నీవు! శిష్యునకుఁదగిన గురుఁడతఁడు!

సిద్ధు:—మీచిత్తము మీయధీనము. ఎట్లనుకొనిన నట్లనుకొనవచ్చును. తత్ఫలము ననుభవింపనువచ్చును.

భీమా:—సరి, పిచ్చివానితోఁ జర్చయేల ? ఊరుసమీపించితిమి. నే నూరిలోనికిఁ బోదును. నీవాత్రోవను దొలఁగిపొమ్ము.

సిద్ధు:—ఆత్రోవయేల? ఈత్రోవయేల? సరియైనత్రోవనే పోదును.

భీమా:—నీవీనాఁడు లేవఁగనే ఎవరిముఖము చూచితివి?

సిద్ధు:—నన్నుజూచినవారిముఖమునే!

భీమా:—నీచమత్కారములఁ గట్టిపెట్టుము. లేనిపోని యిక్కట్టులను దెచ్చిపెట్టుకొనకుము.

సిద్ధు:—నేనేమియుఁ దెచ్చిపెట్టుకొనను. నాత్రోవనే బోదును.

భీమా:—నిద్రలేచినప్పుడు నీకు శకునము మంచిదిగాలేదు. నేనేమొ సరసాలతోఁ బోనిచ్చుచున్నాను. అదుగో! మాయూరివారు కొందఱువచ్చుచున్నారు. వారు నీమాటలు విన్నచో, నిన్నూ రక పోనీయరు.

సిద్ధు:—ఎందువలన?

భీమా:—ఇది యగ్రహారము. పింజారులు పోఁదగదు.

సిద్ధు:—ఎవరు పోవచ్చును?

భీమా:—ద్విజులు మాత్రమే.

సిద్ధు:—శూద్రులుమాత్రము పోఁగూడదా?

భీమా:—వీథులుమున్నగునవి యూడ్చుటకుఁ బోఁదగును. తక్కినగల సమయములలో వారును బోరాదు!—ఇంతేల? మీగురుఁడును ఇచ్చటికి రాఁదగదు.

సిద్ధు:—ఆవిషయ మప్రస్తుతము. నేనే పోదును.

(గురునాథసోమయాజులు, త్రివిక్రమశర్మ, ప్రవేశింతురు)

గురు:—అదుగోనోయి! భీమావధానులు వచ్చుచున్నాఁడు.

త్రివి:—రెండవవారెవరో? వారికడ్డముగ పోవుచున్నాఁడేల?

గురు:—పద, పద, పరుగెత్తు. మనము వారికడ్డమై నిలుతుముగాక!

త్రివి:—ఎవరోయి నీవు?

సిద్ధు:—నాపేరు సిద్ధుఁడు. నేను పోతులూరు వీరబ్రహ్మసద్గురుని శిష్యుఁ డను.

గురు:—ఆయూరినిండను బోతులేయుందురుగాఁబోలు. అతఁడు వానికి గురువా?

సిద్ధు:—ఎంతకంత యనుభవింపక తీరదు సుఁడీ !

త్రివి:—నేను స్నానముఁజేసి శుద్ధుండనైయున్నాను. లేనియెడల నీకు బుద్ధిచెప్పియుందును

సిద్ధు:—అటులనా ? వినుఁడు.

తే। గీ। ఎపుడు కప్పలు, తాఁబేళ్లు ♦ నేటినీట
మునిఁగియుండియుఁ బరిశుద్ధి♦గొననియట్లు;
ఒడలిమలినంబు వెలుపలఁ♦బడినమాత్ర
మనుజుఁడేవేళనైన ని♦ర్మలుఁడు కాఁడు;

భీమా:—నాభీమాకారతఁ జూపుమందురా ?

గురు:—ఓరీ ! మేము శ్రోత్రియులము. వేదాధ్యయనము చేసినవారము. మావద్ద నీబింకములు సాఁగవు. నీవొక్క యడుగు కదలించుము. నిన్ను బలివెట్టెదము సుమీ !

సిద్ధు:—కటకటా !

శ్లో॥ సురాభాణ్డే యథా తోయమ్, శ్వస్పృష్టంచయథాపయః,
ఊషరేచ యథావారి, వృత్తహీనే తథా శ్రుతమ్॥

తే। గీ॥ నెఱిసురాభాండమున నున్న ♦ నీరుపోలెఁ,
బాపశునకంబు ముట్టిన ♦ పాలు కరణి,
చవిటినేలపయిం బడ్డ ♦ జలము భాతి,
వృత్తహీనుని శ్రుతమెందు ♦ వృథయె సుండు !

ఆర్యులారా ! మీకీయగ్రహారమేల ? శాంతవృత్తములేని చదువులు వ్యర్థముగదా ? మీకుఁ దెలియదా ? నేనొక్కరం గూర్చి చెప్పుటలేదు. మిమ్మధిక్షేపించినటుల భావింపకుఁడు.

త్రివి:—ఓరీ ! తుచ్ఛుఁడా ! నీవు దేవభాషను జదివి, మహాదోషముం గావించియున్నాఁడవే. ఈభాషయందు దివ్యతేజముండును. మీరు దానిని సేవింపఁదగదే. ఏహీనుఁడు నీకీ శ్లోకములనేర్పినాఁడు ? అయ్యో ! అయ్యో ! ఆర్యా ! మతము నాశనమైనది.

సిద్ధు:—ఆదివ్యతేజమును మీరెందు దాఁచిపెట్టనెంచెదరు ? "అణోరణీయాన్మహతోమహీయాన్" అను శ్రుతి మీకు జ్ఞప్తిలేదా ?

మీలోను, నాలోను, సకల దేవతలలోను, సమస్త చరాచర భూతకోటిలోను, కొద్దియనక, గొప్పయనక, నిండియుండు బ్రహ్మతేజము లేనిచోటెక్కడ?

గురు:—వీఁడు సాక్షాత్తుగ నుపనిషత్తులనే పఠించుచున్నాఁడు. ఇంక లోకము నిలుచునా? ఏదో మహాప్రళయము రానున్నది. వర్ణాశ్రమధర్మములు నష్టేటఁగలసినట్లే. వీనిగురుఁడెవఁడో, రాఁడు. నేలఁగూల్చి పాదములమట్టాడి, బుద్ధిఁగ అపుదును.

సిద్ధు:—తీవ్రత వలదు. మీరు యువకులుగానున్నారు. ఇంచుక వెనుక ముందాలోచింపవలయును.

తే॥గీ తొందరించి, మహాత్ములదూరు చెల్ల,
అఘమునకు మూలమౌ, దాన హానిదోడరు;
కొనకుఁ దమచేతకై నొచ్చు కొన్నఁగాని
ఫలము సున్నయె సుండు; విప్రవరులార!

మీగోత్రపురుషుల సంస్మరించియైనను, మీపెద్దలమర్యాదను బాటించియైనను, సరసముగ మాటలాడుఁడు.

భీమా:—నోరుమూయుము. నిన్నిపుడు పుడమికిఁ బలిపెట్టుదుముసుమీ!

సిద్ధు:—కటకటా! శ్రీమదాదిశంకరభగవత్పాదులను నిరతము సంస్మరించునగ్రహారముకడనా, నన్ను బలిపెట్టునది?

శ్లో॥ నైనం ఛిన్దన్తి శస్త్రాణి, నైనం దహతి పావకః,
నచైనం క్లేదయన్త్యాపో, నశోషయతి మారుతః॥

తే॥ గీ॥ శస్త్రములు దీనిఁ గోయఁగా సాధ్యమగునె?
అగ్నులకుఁ దీనిఁ గాల్పఁగా నలవిగాదు;
సలిలములు దీనిఁ దడుపఁగాఁజాలవెపుడు;
గాడ్పునకు దీనినెండింపఁగాదుసూవె?

మీరు బలిపెట్టుదుమని బెదరించుచున్నక్తి దేనిచేతను నశింపఁజేయవీలుకాని శాశ్వతవస్తువు. అది నిత్యము. అన్నలారా! విప్రవరులారా! కినుకచేఁ బరవశులైనమీనోట ఎట్టియసంబద్ధవాక్కులు వెడలుచున్నవో, ఒకింతయాఁగి విచారింపుఁడు.

త్రివి:—ఓరీమూర్ఖా? జాతిమతభేదములులేక యందఱు నొక్కటిగ నుండవలయుననియా? నీవాదము?

సిద్ధు:—పారమార్థమునకా, వ్యావహారికమునకా, మీరనుగునది?

గురు:—వ్యావహారికము నెవఁడు మన్నించును? మాకు, ముఖ్యముగా బ్రాహ్మణులకుఁ బారమార్థికమే ప్రధానము.

సిద్ధు:—ఇట్లయిన మనమందఱమును సోదరులమే! నాపై సోదరప్రేమఁ జూపి నామాట నాలకింపుఁడు.

త్రివి:—ఓరీ నీచుఁడా! నీవు బ్రాహ్మణులతోఁ బరమపవిత్రులతో, సోదరత్వముఁగల్పించుకొనఁజూతువా? పరమార్థచింత నీచకులునకు నీకేలఁగలుగఁగలదు?

సిద్ధు:—ఎట్లో మనవి జేసికొనెద—

తే। గీ॥ పెక్కు పాత్రలు గలవని ♦ పేరుకొనుఁడు!
అవియు వేర్వేరురూపము♦లనితలఁచుఁడు!
వానిలో నీరునింపిన ♦ వారమగుదు
మన్నిట నినుండు సముఁడయి ♦ యలరకున్నె?

గురు:—అట్లే యన్నిశరీరములలో సమానముగ నాత్మ ప్రకాశించు ననువాదమునకు దిగుచున్నాఁడు.

సిద్ధు:—అవి వేర్వేఱు లోహములతోడను, మట్టితోడను, గొయ్యతోడను, నిర్మితములయిన వనుకొనుఁడు. అప్పుడో?

గురు:—నీవెంత చెప్పినను శరీరభేదములఁ గూర్చియేగదా, ఈస్థూలశరీరభేదమును మేముపాటింపము. మాబ్రాహ్మణులలో నే నల్లనివార లున్నారు. ఎఱ్ఱనివర్ణము కలవారున్నారు. కుంటివారున్నారు. గ్రుడ్డివారున్నారు. ఈభేదములనుబట్టి పారమార్థికముగఁ దారతమ్యమును సాధింపఁ జూచువాఁడు కేవలము మూర్ఖుఁడు.

సిద్ధు:—చిత్తము, నేనది యొప్పుకొందును.

భీమా:—ఒప్పుకొనక చేయునదేమున్నది వర్ణాదిభేదములకు శరీరమాధారము గాదు. అన్నిటఁ బరమాత్మ సమముగా నున్నాఁడనుటయు నుచితముకాదు. ఆపరమాత్మ తేజమును బ్రకాశమునకుఁ దెచ్చుటే

జన్మపరమార్థము. ఎంతెంతవఱకీ తేజస్సు ప్రకాశమునకువచ్చెనో యను నంతరములను బాటించుటచేత వర్ణము లేర్పఱుపఁబడినవి.

సిద్ధు:—మీరుచెప్పునది సర్వమును, తథ్యము.

త్రివి:—అట్లైనచో మమ్ము ధిక్కరించిపలుకుటవేల ? సాష్టాంగపడి నమస్కరింపుము.

సిద్ధు:—మీరిప్పుడన్నమాటను స్థిరపఱచి, అందఱము దానిననువర్తించుట ధర్మమని తేలినయెడల, నేనేమిచేయవలసివచ్చిన నట్లే చేసెద.

త్రివి:—నీవు చాలా పెంకెవాఁడవు. అధికప్రసంగివి.

సిద్ధు:—ఇంతకుఁబూర్వముచెప్పిన పాత్రలనిదర్శనమును, వర్ణాశ్రమ వివరమున కుపయోగింపకపోదు.

గురు:—ఎట్లు ?

సిద్ధు:—ఆపాత్రములలోని నీరునుబట్టి భేదప్రకాశముకలుగును. అది నీటిరంగునుబట్టియు, దానిలోనున్న కల్మషమునుబట్టియు, నుండును. దుమ్ముండవచ్చును. మన్నుండవచ్చును. జిడ్డుండవచ్చును. పొగకాటుక యుండవచ్చును.

భీమా:—అవును. నీరు స్వచ్ఛముగానున్నపాత్రములను బ్రాహ్మణులకును, ఎఱ్ఱరంగున్న నీటిపాత్రలను, క్షత్రియులకును, జిడ్డున్న వానిని వైశ్యులకును, బురదయున్నవానిని శూద్రులకును, బోల్చుదము. కావున బ్రాహ్మణులలో బ్రహ్మతేజము గరిష్ఠము. వారినివాసనములందుచేతఁ బవిత్రములు. వారిని సమస్తమైన వారును బూజింపవలయును.

సిద్ధు:—ఒప్పుకొందును.

గురు:—ఇఁక నోరుమూసికొని, క్షమార్పణగోరి తొలఁగి చనుము.

సిద్ధు:—ఆబ్రహ్మతేజము ఎవరియందెక్కుడుగాఁ బ్రకాశమునకువచ్చునో చూడవలయును.

త్రివి:—నీలోను, మాలోను, నా ?

సిద్ధు:—ఇపుడంతియే !
భీమా:—మమ్ముఁ బరీక్షించువాఁడవా ? అందుననునీతోఁబోలికకును, బోటీకిని, మేముదిగవలయునా ? ఇంతియగాక నీవుశ్రేష్ఠతముఁడ వనియు సూచింతువా ? ఏమిపొగరు ?
గురు:—మనమింతవఱకును జూపినశాంతమే విషమైనది.
సిద్ధు:—మనమనక, మనకనుఁడు.
త్రివి:—ఛీ ఛీ, తులువా ! (అందఱుకొట్టఁబోదురు)
సిద్ధు:—మీరు నాతనువును జిన్నచిన్న తునుకలుగఁజేసి, భక్షించినను, సత్యమునకు జయము తప్పదు. అది నాయదియై యుండును. మీయుడుకుఁ బోఁతుతనమే సాక్ష్యము. నాసద్గురుపాదములే నాకు శరణ్యము. శ్రీ పోతులూరు వీరబ్రహ్మేంద్రసద్గురూ ! సత్యమును సంరక్షింపుము. (వీరబ్రహ్మేంద్రస్వామియు, గోవిందమ్మయు, శిష్యులును, ప్రవేశింతురు.)
వీ।బ్ర:—ఆపోరాట మేమిటి ? ఎవరో దెబ్బలాడుకొనుచున్నారు.
గోవిందమ్మ:—అయ్యో ! అందులో సిద్ధుఁడున్నట్లున్నదే.
సిద్ధు:—(పరుగిడుచు వచ్చును.) గురుమహారాజా ! నమస్కారసహస్రములు. వీరు నన్ను వధింపఁబూనిరి. సెలవైనయెడల నిగ్రహింతును.
వీ।బ్ర:—వీర లెవరు ? ఎందుకు వివాదము ?
గురు:—మేము బ్రాహ్మణులము. ఈపుష్పగిరి యగ్రహారికులము. మా పుణ్య నివాసస్థానమును సమీపింపక దూరముగఁ దొలఁగి పొమ్మంటిమి. ఈతఁడు వాగ్వాదమునకు దిగినాఁడు. మమ్మదింపినాఁడు.
వీ।బ్ర:—ఫలితార్థమేమి ?
సిద్ధు:—వీరివాదము వీరికే యెదురైనది. శేషమునిట్లుజూపుచున్నారు.
వీ।బ్ర:—నాయనలారా ! మీగోత్రములేమి ?
త్రివి:—నీకెందుకాప్రశంస ? నీవును వాదమునకు దిగుదునా ? నీవు వీనికి గురుఁడవటే ?

వీ॥బ్ర:—అగుఁగాక! తగవువలదు. నెమ్మదిగ సమాధానముకు గూర్చుకొందము.

గురు:—అటులైనచో సత్వరము, ఆటుగాఁదిరిగి యీయగ్రహారము నపవిత్రముసేయక చనుఁడు.

వీ॥బ్ర:—అనవసరవైరము వలదు. బ్రతిమాలెదను.

భీమా:—వాదముతో విసిగియున్నాము. మీరొక్కయడుగైనను ముందుకుఁబెట్టవలదు. అటులైనచో మీప్రాణములు మీకు దక్కవు.

గోవిందమ్మ:—నాయనలారా! వివేకముమాలి మహాత్ములతో నిగ్రహముకనుఁబూనుట ప్రమాదమగును.

త్రివి:—ఛీ, యూరకుండుము.

వీ॥బ్ర:—ఏమంటిరి? ఏమంటిరి?

(విప్రులు కలియఁ బడుదురు. కొందఱు ఱాళ్ళు రువ్వుదురు.)

సిద్ధు:—ఇఁక మేము చేయునదిలేదు. మీకర్మమునకుఁ దగిన శాస్తి ననుభవింతురుగాక!

(తెరలో కలకలము)

భీమా, గురు, త్రివి:—(అటుచూచి) అయ్యో! అయ్యో! మాకొంపలు తగులఁబడుచున్నవి. మాయగ్రహారము భస్మీపటల మగుచున్నది.

(పరుగిడిపోదురు.)

వీ॥బ్ర:—అబ్బాయీ! సిద్ధా! ఏమిచేసితివి?

సిద్ధు:—ఇందు నాలోపములేదు. నాతల్లినిదూలనాడిన దోషమునకు ఫలము ననుభవించు చున్నారు.

గోవిందమ్మ:—సిద్ధా! నీవేమిచేసితివి? ఆమంట లెక్కడివి?

సిద్ధు:—మనస్సులో గురునిఁదలఁచి శపించితిని.

(కొందఱుబ్రాహ్మణులు విలాపముతోఁ బ్రవేశింతురు.)

బ్రహ్మ:—స్వామీ! స్వామీ! మాయపరాధములు లేవు. కుఱ్ఱవాండ్రెవ్వరో అపచారములు చేసినారు. మన్నింపుఁడు!

పోతు:—(పరుగెత్తివచ్చి) శబాష్ ! మంచిపని జరిగినది !

గోవిందమ్మ:—ఏమిజరిగినది?

పోతు:—మంచి శాస్తి జరిగినది. వీరల పొగరణఁగఁదగినదే.

బ్రాహ్మ:—తల్లీ ! నెమ్మదిగఁజెప్పుకొందుము. ముందుమంటలార్పుము.

పోతు:—ఆర్పఁదగినవి మీకొంపలుగాని, మంటలు గావు.

గోవిందమ్మ:—ఎట్లుకలిగినవి మంటలు ?

బ్రాహ్మ:—ఎట్లు కలిగినవో ! ముందార్పుముతల్లీ ! తండ్రీ ! ప్రభూ ! వీరబ్రహ్మముగారూ ! మంటలార్పుఁడు. మాయాలుబిడ్డలు తగులఁబడి పోవుచున్నారు. జాలిలేదా ?

సిద్ధు:—మునుపువచ్చిన మీ ప్రతినిధులేరీ?

బ్రాహ్మ:—ప్రతినిధులా ? ప్రతిపక్షులా ? మీప్రతిపక్షులు మాకు నెపుడును బ్రతిపక్షులే !

సిద్ధు:— వారిని రమ్మనుఁడు.

బ్రాహ్మ:—నీవే శాపమును బెట్టితివఁట. రక్షింపుము రక్షింపుము.

సిద్ధు:—మాగురువుగారిని శరణుజొచ్చుఁడు.

పోతు:—వలదు, వలదు. బ్రాహ్మణాధములు క్షంతవ్యులుగారు.

బ్రాహ్మ:—స్వామీ ! స్వామీ ! కరుణ ! కరుణ ! పోతు లూరయ్యకుఁ జమనవేసిన నున్నమతియుఁ బోయినట్లున్నది. బ్రాహ్మణ నింద యేల ? నీవు బ్రాహ్మణుఁడవుగావా ? వీరిపైఁగినిసి నీస్వత్వ మొందృజింతువా ?

వీ॥బ్ర:—సిద్ధా ! ఉపసంహరింపుము.

సిద్ధు:—తల్లీ ! ఆజ్ఞనిడుదువా ?

గోవిందమ్మ:—తత్క్షణము మంటలార్పుము.ఎలుకలమీఁది కోపమున నింటికిఁజిచ్చుపెట్టుటయా ? వీరలెవరు ? మన బిడ్డలుగారా ?

పోతు:—వీర లెప్పుడు నిటులనే పల్కుదురు. వీరు సదా శత్రుపక్ష పాతులే ! ఈబ్రాహ్మణులు నిరంతరము తమను అవమానము

లేకున్నచో వారిని బాధింపక, వారికర్మశక్తిని స్తంభింపవచ్చును గదా ?

సిద్ధ:—సత్యము, సత్యము; తండ్రీ ! నేనపరాధిని. తల్లీ ! నీహృదయము కృపాసాగరము గదా? ఇప్పుడు అగ్రహారికులగతి యేమి ? ఎందఱు మడిసిరో;

వీ|బ్ర:—అందఱును యథారీతి క్షేమముగ నున్నారు. చింతింపకుము.

సిద్ధ:—ఇప్పటికి నామనస్సు కుదురుకొనినది. బిడ్డలు చేసిన దోషములు జనకులిట్లుగదా సహింపవలయును. తండ్రీ! తల్లీ! సాష్టాంగ నమస్కారశతములు.

(శృంగారముగా నలంకరించిన రథముతోఁ గొందఱు బ్రాహ్మణులు ప్రవేశింతురు.)

బ్రాహ్మ:—స్వామీ! శ్రీశ్రీ పోతులూరు వీరబ్రహ్మేంద్ర మహా గురుదేవా! మాయందుఁ గృపయుంచి యీరథము నలంకరింపుఁడు.

వీ|బ్ర:—ఇదేల?

బ్రాహ్మ:—బ్రహ్మరథముపట్టి, మిమ్మీనాఁడు పూజించి, ధన్యులము కావలయునని సంకల్పించుకొంటిమి.

వీ|బ్ర:—మేమొనరించిన యీ స్వల్పకార్యమునకై యింతటి గౌరవమా ?

బ్రాహ్మ:—దేవేశా ! ప్రత్యేకముగ నేయుపకృతికని, మిమ్మిట్లర్చింపఁ బూనలేదు. మానేత్రములఁ దెఱచుటకిదొక నిమిత్తకారణమే యగునుగాక. త్రిమూర్త్యాత్మకమైన నీమహాతేజమును మనములఁ భావించి, నిన్నుఁ బూజించి, జన్మసార్థకముఁ జేసికొనఁ గోరి యుంటిమి.

వీ|బ్ర:—సోదరులారా ! ఇంతటియుద్రేకము తగునా ?

బ్రాహ్మ:—దేవా ! ఇది యుద్రేకము గాదు. మాయందమితోత్సాహ మావహించియుంట తథ్యము. అయ్యది కృతజ్ఞతామూలకము గాదు. సత్యజ్ఞానోదయముచేనావిర్భవించిన భక్తియే మమ్మిట్లు పురికొల్పుచున్నది.

వీ॥బ్ర:—మేమీగ్రామమున నిలువ సంకల్పించి యుండలేదు. కడపనగరము త్వరలోఁజేరనుద్దేశించి యున్నారము.

బ్రాహ్మ:—ఎట్లులైనను, మమ్మనుగ్రహింపక తీరదు.

(అందఱును మోఁకరింతురు.)

గోవిందమ్మ:—వీరింతగాఁ బ్రార్థించుచుండ నిరాకరించుట తగదు. నాథా! అనుగ్రహింపుఁడు!

వీ॥బ్ర:—సిద్ధా! ఏమందువు?

సిద్ధు:—ఈబ్రాహ్మణోత్తములు సదభిప్రాయులై యుండనోపు. వీరు పూలఁబూజింపనెంచవచ్చును. రాల రువ్వువారును గలరు గదా?

భీమా, త్రివి, గురు:—సిద్ధపురుషా! రక్షింపుము! మేమిక్కడనే యున్నాము. బుద్ధి దెచ్చుకొంటిమి. అపరాధములు మన్నింపుము.

వీ॥బ్ర:—నీవింకను, ఆయుదంతమును మఱువనే లేదంటివా?

సిద్ధు:—క్షమింపుఁడు! ఆగోడన తడసెఁక.

వీ॥బ్ర:—మిత్రులారా! మీయభీష్టము నొప్పనఁ గాదను.

(శ్రీవీరబ్రహ్మేంద్రస్వామిని, గోవిందమాంబను, బ్రహ్మరథముగఁ దీసికొని పోదురు.) (తెరపడును.)

## మూడవ రంగము.

(సభామండపము. శ్రీవీరబ్రహ్మేంద్రస్వామి, గోవిందమ్మ, సిద్ధుఁడు, పలువురు ప్రజలు, ప్రవేశింతురు)

వీ॥బ్ర:—సిద్ధా! ఈవిప్రవరులడిగిన ప్రశ్నమునకు సంగ్రహముగ సమాధానముఁ జెప్పుము.

విప్రు:—స్వాములవారు సిద్ధప్పచేత నుపదేశముఁ జేయింపఁబూనిరి. అహా! ఎంతటి కరుణ! సిద్ధుఁడు సిద్ధుఁడే! ధన్యుఁడు.

సిద్ధు:—నేనిట్టి మహనీయుల యెదుట నిలుచుటకే యర్హతగలవాఁడను గాను. మీరందు మిక్కిలి ధర్మోపన్యాసము చేయుట కంతకన్న ముందే యనర్హుఁడను. అయినను గురునాజ్ఞ యయ్యె. శంఖము ధ్వనిని వెలువరించునేగాని యాశక్తి పూరించువాఁడే గదా

పదపడి యీయాత్మ ♦ బంధించి మనుట
పతనకారణమది ♦ ప్రత్యక్షమైన
నిరుపమానందైక ♦ నిర్వాణపథము
గాంతుము వేఱింకఁ ♦ గాంచలె నేమి ?
పరమపండితులగు ♦ వారు జీవాత్మ
పరమాత్మ నొకటిగా ♦ భావింతురంట.

ఇచ్చో నాసీనులగు సర్వజనులును నామనవిని సావధానముగ వినవలయును. అన్నలారా! జీవేశ్వరైక్యము పరమావధియని హిందువులెల్లరు నంగీకరింతురు. ఆయైక్యసంధానము, దేహభావమును వీడినంగాని సంభవముగాదని యొప్పుకొందురు. కాని, ఆత్మమోక్షముకన్నఁ దమతమ లోకాడంబరమును హెచ్చుగాభావించి, ఆయాత్మను, దేహమును, ఒక్కటిచేయుచుందురు. ఆత్మవికాస సాధనమునకై పూర్వులు కల్పనచేసిన వర్ణాశ్రమవ్యవస్థను లోకవ్యవహారాడంబరమునకై వినియోగింపఁబూని, పవిత్రమగు నాదర్శమును ఖిలము గావించినాము. ఖిలమైన యావ్యవస్థను స్వలాభపిశాచబద్ధులమై యాత్మవికాసమున కత్యవసరమని వాకొనుచు మనకంటెఁ గొంచెము మందులగువారి నెల్ల నణఁగఁ దొక్కుటకై పూనుచున్నాము.

ద్విపద:—భావించి సత్యంబు ♦ పరికించితేని,
ఈవర్ణ నియమము ♦ లీయాశ్రమంబు
లఘమస్థితులనున్న ♦ యట్టి వారలను,
పృథులసంస్థితులెక్కఁ ♦ బెట్టిన యోగుల
నల పూర్వఋషిచం♦ద్రులు విచారింపఁ
దెలియంగవచ్చెను ♦ దేటతెల్లముగ;
ఇనుఁడెల్లకడఁ దేజ ♦ మిచ్చి వెల్గించు;
నినుని వెల్గించున ♦ దేదైనఁ గలదె ?

యటుల స్వయంప్రకా ♦ శాత్మ సమస్త
పటుశరీరంబుల ♦ భాసిల్లుచుండు;
కనదాత్మ తేజంబు ♦ గ్రాలని యెడల,
మన ప్రజ్ఞలన్నియు ♦ మాంద్యముల్ నుండి!
కాన శరీరంబు ♦ ఘనమని చెప్పి
దాన నాత్మం దనర్పం ♦ దనవెఱ్ఱి కాదె?
నేన శ్రేష్ఠుండనని, ♦ నేం బూజ్యుండ నని
నేన జగన్మాన ♦ నీయుండ ననెడి
దురభిమానంబు నెం♦మను దోంచనీక,
నిరభిమానవ్రత ♦ నియమము పూని
నెఱి నుత్తమస్థితి నెఱపిన కొలంది
నరుండు హెచ్చుగ సాధ ♦ నము సేయవలయు;

శ్లో॥ త్రిభిశ్చ కరణై స్సమ్యక్ హిత్వా వైషయికీం క్రియాం,
స్వాత్మైకచిన్తనం యత్తు దీశ్వరధ్యాన మీరితమ్॥

తే॥ గీ॥ మదిని, వాక్కునం, గాయకర్మమున, విషయ
భోగసంతాన మెంతయుం ♦ బూన్కి విడిచి,
స్వస్వరూపాత్మచింతన ♦ సలుపు టెదియొ,
యదియ భగవంతు ధ్యానమ ♦ యగును లెండు!

ఇది ముక్తిమార్గము. దీర్ఘోపన్యాసములు చేయుటగాని, వినుటగాని, జిజ్ఞాస గాదు. దీర్ఘచింతనమే ముక్తిసాధనము. సోదరులారా! గురుకటాక్షముచే మీరాపక్షము నవలంబింతురుగాక!

బ్రాహ్మణులు:—సద్గురు వీరబ్రహ్మేంద్రులకు జై! శిష్యోత్తముండు సిద్ధప్పకు జై!!

వీ॥ బ్ర:—సోదరులారా! కోలాహలమును గొంచెము నిలుపుండు. మీరందఱును సిద్ధనివాక్కులు వినియున్నారుగదా! అవి సోదరుండు శంకరునిగొప్ప యుపదేశములే! అతనిని నన్నును, అభే

దముగా నెంచుఁడు. జగమున నెట్టిఘనతమోపదేశము లైనను, బరంపరాగతమై రాఁగా రాఁగా మొదటిమహిమను గలిగియుండవు. స్వార్థపరులు వానికపార్థములను గూడఁ గల్పనచేయుదురు. ఇది లోకసహజవృత్తి. సిద్ధుఁడు కేవలము పుష్పగిరివాసులఁ గూర్చియే ముచ్చటించినను, ఈధర్మములు సర్వజనాంగీకార మైనవి. హిందూ, క్రైస్తవ, ముసల్మాను, పారసీత్యాది మతస్థులందఱును గమనింపఁదగినవి. భాషాభేదముచేఁగల్గు నామభేదమేతప్ప పరమార్థమొక్కటియే, రెండుగాదు. "ఏకం సద్విప్రా బహుధా వదన్తి" అని శ్రుతివచనము. కావున నెట్టివ్యత్యాసములను గణింపక, ప్రతివారును అంతర్ముఖులై జ్ఞానాన్వేషణము గావించుచో, వారివారియందు నిగూఢమైయున్న యఖండజ్ఞానరాశి సోపానక్రమమున వారిని నడపి పరమగమ్యమును జేర్పఁగలదు. చేతనైనచో మీరితరుల నుద్ధరించుటకుఁ బ్రయత్నము సేయుఁడు. లేనిచో మిన్నకుండుఁడు. ఉత్తమదశనందఁ గడఁగువారి కడ్డమెన్నఁడును బోకుఁడు. త్రికరణములకు సామరస్యముఁ గూర్చి వర్తింపుఁడు. మీయంతరాత్మమీకుఁ గలదని సూచించు న్వార్థతనుమించి యన్వార్థతలభించెనని చాటకుఁడు. ఇది యాత్మద్రోహమగును. త్రికరణసామరస్యవృత్తియే వర్ణము. అదియే, ఆశ్రమము. అదియే, మతము. అదియే, ముక్తిమార్గము ! తత్సిద్ధియే, ముక్తి !

సర్వేషాం స్వస్తి ర్భవతు ! సర్వేషాం శాం
తి ర్భవతు ! సర్వేషాం పూర్ణం భవతు !!
ఓంశాంతి శ్శాంతి శ్శాంతిః.

(తెరపడును.)

ఇది షష్ఠాంకము

# బ్రహ్మానందలీలలు

## సప్తమాంకము.

### మొదటి రంగము.

(కడపకుఁబోవు బాట. (బ్రహ్మముగారి శిష్యులు, ఓంకారయ్య, పోతులూరయ్య, ప్రవేశింతురు)

1. శిష్యు:—మనసంగతి యేమిటి? కుమారులగతియు నట్లే యున్నది.

పోతు:—ముందువచ్చిన చెవులకంటె వెనుకవచ్చినకొమ్ములు వాఁడి యన్నట్లున్నది. మాకర్త్రతలేదుగాని సిద్ధున కన్నిరహస్యము లును బోధింతురు.

ఓంకా:—నాయనగారు సర్వజ్ఞులు, త్రికాలవేదులు. మనము తీవ్ర ముగ మాటాడఁదగదు. రహస్యములు దాఁగవు.

పోతు:—నాకు రహస్యములేమున్నవి? మీరు వల్లెయనుఁడు. ఎదురు గనే యడుగుదును.

2శిష్యు:—మీరెందులకైనఁ దగుదురు. సిద్ధప్పదిలోపముగాని, గురువు గారిలోపమేమున్నది?

1శిష్యు:—గురువుగారిలోపముకూడనా? ఆయన నిర్ద్వంద్వమూర్తి! త్రిగుణరహితుఁడు! లీలామానుషవిగ్రహుఁడై వర్తించుచున్నను కేవలము నిష్క్రియుఁడు. కర్మయందకర్మమన నిట్టిదే.

ఓంకా:—మీరు నన్ను బిలిచినదెందులకు?

2. శిష్యు:—ఉపాయము చెప్పుటకు.

ఓంకా:—నేను సాహసింపను.

పోతు:—సాహసించువాఁడను నేను. కర్తవ్యమును దెలుపుఁడు.

1. శిష్యు:—గురువుగారి కేమియుఁ దెలియరాదు.

ఓంకా:—అది యసంభవము.

2 శిష్యు:—సందేహము కలిగినఁగాని, వారు దేనినిఁ గూర్చియు జిజ్ఞాస పూనరు. అపుడుగదా మనచర్యలు బయటఁబడుట.

1 శిష్యు:—అట్టిసందేహము వొడముట కవకాశమునిలేరీతిని నడువ వలయును.

పోతు:—పిరికినారితోఁ జెలిమి ప్రాణాపాయకరము.

2 శిష్యు:—నేననుకొనినట్లె యైనది. అటు చూడుఁడు.

ఓంకా:—నాయనగారును, సిద్ధుఁడును, వచ్చుచున్నారు.

(వీరబ్రహ్మేంద్రస్వామియు, సిద్ధుఁడును, బ్రవేశింతురు)

వీ|బ్ర:—ఏమి కుఱ్ఱలారా! ఇంక నిందేమి చేయుచున్నారు? మీరు ముందు సాఁగిపోయిరనుకొంటిని.

1శిష్యు:—తల్లిగారిబండి సాఁగిపోయినది. సామానులన్నియుఁ జక్కఁగా నమర్చి పంపినాము. మనతోరానున్నమిత్రులును బయలుదేఱి వచ్చుచున్నారు; త్వరలోనే కలసికొనఁగలరు.

వీ|బ్ర:—నాకు దప్పియగుచున్నది; కొంచెమునీరును దెచ్చియిండు.

ఓంకా:—(తనలో) ఎంతయజాగ్రత్త! ఉదకమును వెంటఁదీసికొనక వచ్చితిమి.

2శిష్యు:—స్వామీ! అపరాధము. వెంట నీరుందెచ్చుట మఱచితిమి. ఇందేయెడను నీరున్నజాడలేదు.

వీ|బ్ర:—అటుచూడుఁడు. ఆ చెట్టుక్రింద నెవఁడోయున్నాఁడు. వానికడ నీరుండనోపు. కనుఁగొనుఁడు.

పోతు:—ఔను. వానికడ జలము దొరకవచ్చును. ఇంతయెండలో నెవఁడో కొలిమిపెట్టి లోహముకరఁగుచున్నాఁడే! ఓహో! వాఁడు తురకవలెనున్నాఁడు.

వీ|బ్ర:—అయిననేమి? పోయినీరడుగుఁడు.

(ఓంకారయ్య పోయివచ్చును.)

ఓంకా—తండ్రీ! అతనికడ నుదకములులేవు. ఎచ్చటనేని యున్న జాడఁదెలుపుమన్నఁ జిరాకుఁజెంది కొలిములోని మూసయందుఁ గరఁగియున్న లోహముత్రాపుమన్నాఁడు. నాకుఁగాదు

పూజ్యులగు తండ్రిగారికిఁ గావలయునని చెప్పితిని. అతనాతఁడు నిర్లక్ష్యముగా వానినైనను దానినేగొని పొమ్మనెను.

పీఠబ్ర:—నీవేల గొని రావైతివి ?

(ఓంకారయ్య మిన్నకుండును.)

పోతులూరయ్యా ! నీవుపోయి యామూసను జేతఁబట్టుకొని రమ్ము.

పోతు:—(తనలో) విషమపరీక్ష వచ్చినదే, (ప్ర) తండ్రీ ! అదెట్లు సాధ్యము ?

పీఠబ్ర:—(1, 2, శిష్యులతో) మీరుపోయి తీసికొనిరండు !

1, 2, శిష్యు:—స్వామీ ! క్షమింపుఁడు ! సాధ్యమైనపనిని దేనినైనఁ జేయుదుము. దీననెట్లు నిర్వర్తించుట ?

పీఠబ్ర:—సిద్ధప్పా ! నీవేమైనఁ దేఁగలవా ?

సిద్ధ:—సద్గురు దేవుని యనుగ్రహమున్నచోఁ బ్రయత్నింతును. దేవర యాశీర్వచనమే రక్ష. పోయివత్తును. (గురుధ్యానము చేయుచుఁ బోవును.)

పోతు:—(తనలో) కాఁగలకార్యము గంధర్వులు తీర్చినట్లుచేకూరినది.

1 శిష్యు:—(తనలో) ఏమి వీనిగర్వము. ముందువెనుకాడక పర్వెడెనే!

2 శిష్యు:—వీరలకోర్కె లీడేరుకాలము వచ్చినది.

ఓంకా:—(స్వ) సిద్ధునిగర్వము నణంచుటకే తండ్రి యిట్లుజేసియుండ వచ్చును. ఈ దుర్గర్వ మెల్లప్పుడును మునుకు దుముకుచునే యుండును.

(సిద్ధుఁడు కరఁగిన లోహముతో నున్న మూసనుదెచ్చును.)

సిద్ధ:—తే. గీ. గురుకటాక్షము పడసిన ♦ నరునకెప్పు
డలవికానిది యొక్కటి ♦ యైనఁగలదె?
గురుకరుణకున్న మహిమ యొం ♦ డరయరాదు;
అది కలుగఁ గాదె నేమూస ♦ నందుకొంటి;

పీఠబ్ర:—సిద్ధా! తెచ్చితివా?

సిద్ధ:—చిత్తము ! గురుస్వాముల కటాక్షము. (అందించును)

వీ॥బ్ర:—(మూసను జేబూని మండుచున్న లోహమును గొంతదాఁవి, తక్కినవారి కీయఁబోవును. సిద్ధుఁడుమాత్రము తుదకు దాని నందుకొనెను.) సిద్ధా దీనిని దాఁవుదువా ?

(లోహమునిచ్చిన మహమ్మదీయుఁడు ప్రవేశించును.)

సిద్ధు:— గురుప్రభువుల యానతియైనచో నేను జేయఁగడంగ యుండఁగలదా ? (మూసలో మిగిలిన లోహమును ద్రావును.)

మహమ్మ:—యీళ్లూ మనుష్యులుండార్ ? పిసాచాల్ నిచ్చయ అరే ! అరే ! నాతగ్రం, నాతగ్రం, హాంతాలాగేసారే !

వీ॥బ్ర:—భాయీ ! ఏమాలోచించు చున్నావు ?

మహమ్మ:—బడాఆద్మీ వుండావ్. సలాం ! యేంలేదు.

(స్వ) తగ్రం పోతేపోయింది. యీళ్ళదగ్గ మాట్లాడ్రాదు.

(1,2,శిష్యులు, ఓంకారయ్య, పోతులూరయ్య, భయముతో గుసగుస లాడు చుందురు.)

సిద్ధు:—గురురాజా ! నాకుం బాలసేపటినుండి దప్పి యగుచుండెను. అనువుగాని యదనున నీరుగోరఁజాలక యూరకుంటిని. దేవర యనుగ్రహమువలన నాపిపాస తీరినది. పుష్టి గొనుదవినది. ప్రయాణమై పోవుదమా ?

వీ॥బ్ర:—అట్లే !

(అందఱు నిష్క్రమింతురు.)

తెరపడును.

---

రెండవ రంగము.

(కడపనబాబు-ఆస్థానము-నబాబు, వీరబ్రహ్మేంద్రస్వామి, సిద్ధప్ప, పౌరులు, ప్రవేశింతురు.)

నబా:—స్వామీ! క్షమింపుఁడు. మీరు చెప్పునది దెలిసికొనుట చాలఁ గష్టముగనున్నది. శివుఁడన్నను, విష్ణుఁడన్నను, అల్లా యన్నను, క్రీస్తన్నను, ఒక్కఁడేయందురు ! అదెట్లు?

వీ|బ్ర:—అవును. వీరిలో నేయొక్కని నాశ్రయించి పూజించినను, మోక్షమందవచ్చును. ఈజగత్తును సృష్టించి, పరిపాలించి, సమయించునట్టి దివ్యశక్తి యొక్కటిగలదని యొప్పుకొందురు గదా?

నబా:—కొందఱటువంటి దేవుఁడు లేఁడందురే?

వీ|బ్ర:—వారిసంగతి మనకుఁ బ్రస్తుతముగాదు. మీరట్టి దేవుఁడు కలఁడందురా? లేఁడందురా?

నబా:—అల్లా యున్నాఁడని యొప్పుకొందును.

వీ|బ్ర:—మీరేపేరు పెట్టుమన్నను నేనొప్పుకొందును. ఆదేవునే యనేకులు మహనీయులు చూడఁగా, వారికతఁడు భిన్నభిన్నముగాఁ గాన్పించినాఁడు.

నబా:—అదెట్లు? స్వామీ! నేననేకులకనేక రీతులుగాఁ గనుపింతునా?

వీ|బ్ర:—చాలకాలము మీసన్నిధానమందున్నవారిసంగతి వేఱు. ఒకఁడు మిమ్ము నాలుగైదేండ్లక్రిందట స్నానము చేయుచుండఁగా మాత్రము చూచినాఁడు. మఱియొకఁడానాఁడే దర్బారుచేయు చుండఁగాఁ జూచినాఁడు. నేను మిమ్ము నమాజుచేయుచుండఁగ మాత్రమే చూచితిని. మేము ముగ్గురమును జూచిన యాకారములు వేఱని యొప్పుకొందురు గదా?

నబా:—ఆ! నారూపముగల పటములు చాలరీతులవి యున్నవి. వానిని నాకడకుఁ దఱచుగవచ్చు గొప్పగొప్పవారే గుర్తుపట్టలేరు.

వీ|బ్ర:—ఇఁకనేమి? మీయాకారమును వారు వేర్వేరుగ వర్ణింతురు గదా?

నబా:—అవును.

వీ|బ్ర:—మీకడకువచ్చువారు భిన్నభిన్నాశయములతో వత్తురు. మిమ్ము భిన్నభిన్న సంబంధములతో దర్శింతురు. భిన్నభిన్న ప్రతిఫలములను బొందుదురు. అవునా?

నబా:—అచ్ఛా!

వీ|బ్ర:—వారు మిమ్ముఁగూర్చి మాట్లాడునప్పుడును, మీగుణగణము లను వర్ణించునపుడును, వేర్వేఱు స్వరూపములను మీ కారో పింతురు.

నబా:—అచ్ఛా!

వీ|బ్ర:—ఈ మీబొమ్మలను, మీగుణశీల వర్ణనములను, వేర్వేఱు పుస్త కములందు ముద్రింపింతుము. అవన్నియు భిన్నభిన్నములగు పుస్తకములగునా? కావా?

నబా:—అచ్ఛా; అగును.

వీ|బ్ర:—ఒక పుస్తకమును వ్రాసినవాఁడు మఱొకదానిని సత్యమని యొప్పుకొనునా?

నబా:—ఎందు కొప్పుకొనును? బహుమానాలు పొందినవాఁడు నన్నల్లా, అనును. శిక్ష పొందినవాఁడు నన్ను సైతానను.

వీ|బ్ర:—కాని, వ్రాసినవారి యుద్దేశ్యమునకును, జ్ఞాకచక్యమునకును, గొంతయవకాశము విడిచిపెడిపఁ, బ్రతిపుస్తకమునను సత్యమే యుండునుగదా? ఆయాగ్రంథకర్తలు నిజముగాఁజూచిన యను భవవిషయమేగదా, వ్రాసినది?

నబా:—అవును. నిజము.

వీ|బ్ర:—భిన్నముగానున్నను నిజమే గదా?

నబా:—ఆహా! నిజము! నిజము!

వీ|బ్ర:—ఇట్లు నిజము భిన్నరూపములతో నుండవచ్చునా?

నబా:—ఒప్పుకొనవలసి వచ్చుచున్నది.

వీ|బ్ర:—ఇదేతీరుగ ననేకమందియోగులు, భక్తులు, మార్వీలు, పరమ హంసలు, భగవంతుని జూచిరి. అనేకరీతుల వర్ణించిరి. కొంచె ముగ నిరాకరించినను, అందఱి బోధలును, నిజమే యందును.

నవా:—బలే! బలే! శబాష్! ఒప్పుకొందును.

వీ|బ్ర:—ఇంక మతద్వేషము లుండరాదు.

నబా:—కూడదు. కూడదు:

వీ|బ్ర:—ఒక మతముహెచ్చు, వేఱొకమతము తగ్గు, అనరాదు.

నబా:—అనరాదు, అనరాదు.

వీ।బ్ర:—అందఱు సోదరభావముతో బ్రతుకవలయుననుట ధర్మము!

నబా:—ధర్మము, ధర్మము.

వీ।బ్ర:—ఇంక మీాధర్మమున్నది.

నబా:—అదేమిటి? చెప్పుడు!

వీ।బ్ర:—మతకలహములు రాకుండఁ జూచుట; పామరులు మతకలహము లను బెట్టుకొని తగవులాడునపుడు పక్షపాతములేక నేరము చేసినవారిని మాత్రమే దండించుట.

నబా:—అయిన స్వామీా!నాకేదో వైకెక్కినది.మీారు చెప్పుచుందంతయు ఒప్పుకొనుచున్నాను. నా భాషకూడమాఱిపోయినది. నాకే నా యిట్లుతోఁచుట? ఈప్రజలందఱకు నిట్లేనా?

వీ।బ్ర:—విచారింతుముగాక!

నబా:—ప్రజలారా! సోదరులారా! అన్నిమతాలును సమము. భేద ముగాఁ గనఁబడుచున్నను, నిజము అని స్వాములవారు చెప్పు చున్నారు. ఒప్పుకొందురుగా?

ప్రజలు:—ఒప్పుకుంటాము!

నబా:—తిన్నగా గ్రహించినారా?

ప్రజలు:—ఇప్పటికి బాగుగనే తెలిసినది.

నబా:—ఇఁకఁ దగవులు లేకుండ నుందురా?

ప్రజలు:—ఉంటాము. ఉంటాము.

నబా:—ముసల్మానులు, హిందువులు, క్రైస్తవులుకూడఁ, దగవులు లేకుండ సోదరులుగ జీవింతురా?

ప్రజలు:—ఆహా! అన్నదమ్ములవలె బ్రతుకుతాము.

నబా:—ఒక్క సందేహమున్నది. అన్నిమతాలు సత్యమయినచో, అందఱు ఒక్కస్వర్గానికే పోదురా?

వీ।బ్ర:—మాశిష్యుఁడు సిద్ధప్ప చెప్పును, వినుఁడు.

సిద్ధు:—అన్ని మతములకును వేర్వేఱు స్వర్గములున్నవి. ఈలోకములో నందఱు తమతమ మతముల ననుసరించి జీవించునటులనే పర

లోకములందును సఖ్యతతో నుండఁగలరు. పరలోకములనఁగా నిటువంటి స్థూలప్రపంచములు కావు. అవిమనోమయలోకములు.

నబా:—అది సరిగా నాకర్థము కాలేదు.

సిద్ధు:—పరలోకములకు మనము పోవునపుడు, స్థూలదేహములను విడిచి పోదుము. మనోమయశరీరములే యుండును. స్వప్నములలో మనముధరించు శరీలములను బోలునవి అవి. ఆలోకములు నట్టిస్వభావము కలవే.

నబా:—సరే! భిన్నభిన్నమైన పరలోకాలు మనకు ఎచ్చుటెట్లు?

సిద్ధు—మనము పెండ్లినిగుఱించి అతిదీర్ఘముగ నాలోచించుచో నొక్కా కప్పుడు ఆపెండ్లిజరిగినట్లే, విందులు గుడిచినట్లే, కలలు ఎచ్చును.

నబా:—నిజము,నిజము.

సిద్ధు:—వేఁటనుగుఱించి మిగులఁ దమకముతో మననముజేసినచోఁ దదనుగుణ్యమగు కలలు, అనుభవములు, చేకూరును.

నబా:—ఆహా! సత్యము.

సిద్ధు:—మరణమనఁగా నిద్రినుబోలి యుండును. పరలోకజీవనములు స్వప్నముల వంటివి. ఒకఁడు బ్రితికినన్నాళ్లు, క్రైస్తవభక్తుఁడై యుండి, తీవ్రముగఁ గ్రైస్తవస్వర్గమును గూర్చియే ధ్యానము చేయును. వాని భావముల కనుగుణమగు పరలోకజీవనము ననుభవించును. అటులనే మహమ్మదు భక్తుఁడు, అటులనే విష్ణుభక్తుఁడు, శివభక్తుఁడు, బుద్ధ భక్తుఁడు; యోగులందఱును గూడ నట్లే, తమ తమ భావనాలోకములఁ జెందుదురు.

నబా:—అచ్చా! వీరలక్కడఁ బోట్లాడుకొనరుగదా ?

సిద్ధు:—పోరాటములాడు స్థూలశరీరముల నిక్కడనే విడుతురుగదా! ఎవనిస్వర్గము వానికి భావనాలోకముగ నేర్పడి, ఆనంద మయముగ నుండును.

నబా:—నరకమో ?

సిద్ధు:—ఇదేతీరున, భీతివలనను, పాపాత్ములనుభావనవలనను, వారు వారు పాపకల్పనఁ జేసికొనురీతిని, నరకముల ననుభవింతురు!

నబా:—మోక్షమో !

సిద్ధు:—యావజ్జీవముగాని, చాలకాలముగాని, తనకుఁ బునర్జన్మము లేదని కొనువాఁడును, జన్మరహితుఁడ నగుదుననుకొనువాఁడును, దదనుగుణమగు ననుభవమునే పొందును.

నబా:—ఈవిషయము మఱొకసారి విందును. అన్నియు నొక్కసారిగా బుఱ్ఱకెక్కవు. విన్నవానినిగూర్చి యేకాంతముగా మననము చేయవలయును.

సిద్ధు:—ఆతరువాత స్థిరతరభావనను ఆరూఢముఁజేసి, శాశ్వతముగ నిలుపవలెను. ఈ మూఁడుపనులుతప్పక జరిగియే తీరవలయును. శ్రవణము:—వినుటగాని, చదువుటగాని, మననము:—దానిని గూర్చి విచారణ సలిపి, బాగుగాగ్రహించుట. నిధిధ్యాసనము:—పర్యవసానముగఁ దేలినభావనను స్థిరము సేయుట. ఇవి అవసరము.

నబా:—ఇంకొక్క ప్రశ్న. కోపము వలదు భాయీ! సలాముచేసి అడుగుచున్నాను:—అన్నిమతాలలో ముక్తి యుండినయెడల, నీవు హిందువ వెందుకైనావు ? ముసల్మానులకేతో దుఃఖము గల్గించినావేమి ?

సిద్ధు:—అందఱును దమమతమునే అవలంబింపవచ్చును. ఏకారణముచేతనైనను, ఇంకొకమతము హృదయమునకు నచ్చినయెడలను, దనమతమునందు హృదయము చొరనియెడలను, నచ్చినదాని నవలంబించి ముక్తిపొందుటలెస్స. నచ్చినదానిలోనుండి భంగపడున గత్యములేదు. ఇట్లు కొందఱికిఁ దటస్థించును. ఒక్కకుటుంబములో నొకసోదరునికి విష్ణుభక్తియభిమతమనుకొనుడు. మఱొకనికి శివభక్తి హితవు. ఇరువురు తమతమ కనుగుణమగు మతసాధనముచేసి, సఖ్యతతో బ్రతుకుట లెస్స. ప్రేమవీడి పోరాటములకు దిగుటతగదు. అన్న వైకుంఠమునకును, దమ్ముఁడు కైలాసమునకును, బోవచ్చును. ఇరువురు నొండొరులకు సహాయము చేసికొనిరేని, బుద్ధిమంతులనవలయును.

నబా:—బలే బలే! శబాష్! ఎంత బాగుగఁజెప్పితివి. నాకు నచ్చినది. నీవు హిందువుడవగుట యిందుకేనా? హిందూమతము ఏకారణముచేత నో నీకుఁబ్రియతరముగఁ దోఁచినది. కాని నీకు ముసల్మాను మతద్వేషము లేదుగదా?

సిద్ధు:—ఎన్నటికిని లేదు.

నబా:—నిన్ను బ్రహ్మనుగారు బలాత్కారముగ లాగలేదుగదా? ఇట్లడిగినందుకు క్షమింపుము.

సిద్ధు:—బలాత్కారముగ మతాంతరమునఁజేర్పక పోవుటేగాదు; వలదనికూడఁ జెప్పినారు. కానినాపూర్వకర్మవశమున, నాహృదయము శ్రీగురుస్వాములపదసేవకై తహ తహ పడసాఁగినది. అది పరీక్షించి, తుదకునన్ననుగ్రహించి, హిందూమతమునఁ జేరనిచ్చినారు. మఱియు హిందూ ముసల్మానుసఖ్యతకై, పాటుపడునట్లు సమ్మతమతమును బోధింపనాజ్ఞ నిడిరి.

నబా:—ఇంకొకప్రశ్నము నడిగెదను. మీమహిమలు చాలచాలగాఁ బ్రజలు పొగడుచున్నారు. ఒక్కపరీక్ష సేయుటకు నాకనుజ్ఞ నీయవలెను.

వీ|బ్ర—మహిమలభ్రాంతి యేరికిని వలదు. అవి తుచ్ఛములు.

నవా:—తుచ్ఛమహిమలుగావు స్వామీ! గొప్పవారిమహిమలనే నేను చూడఁగోరుచున్నాను. అవిచూచినచో మాకు శ్వాసము చెక్కుచెదరక స్థిరపడును.

వీ|బ్ర:— విశ్వాసములకు మహిమల నాధారము చేసికొంటిరా, భంగపడుదురు సుఁడీ! మహిమలు గారడిచర్యలు. పారమార్థిక వాసనయేని లేనివారెందఱో మహాద్భుతకార్యములసలిపి మిమ్ము మోసగింపఁ గలరు.

నబా:—ఒక్కవిషయమునుమాత్రి మడిగెదను. దానిని జెప్పుటవలన సాధ్యాసాధ్యముల వైఖరిని గొంత గ్రహించి, విజ్ఞానమును గఱచుటకే యడుగుచున్నాను. కరుణించి జబాబిండు. నాసంశయము తీరును.

వీ॥బ్ర:—ఏమిటా సందియము ?

నబా:—అల్లదిగో మాగుఱ్ఱము. అది చూఁడిది. దానిగర్భమునందుఁగల పిల్ల మగదా ! ఆఁడుదా ? ఎట్టి రంగుగలది ? ఇట్టివిషయముల నతీంద్రియదృష్టిచేఁ గనుఁగొనవచ్చునందురు. సత్యమా అని నాసందేహము.

వీ॥బ్ర:— (స్వ) ఎంతటివారికిని మూర్ఖత దాఁటనలవిగానిది. (ప్ర) దానికడుపునఁ గలపిల్ల మగది. పంచకల్యాణి లక్షణ లక్షిత.

నబా:—పరీక్షింపఁ దగునా ?

వీ॥బ్ర:—మీయవిశ్వాసము శోచనీయము. ఇటురమ్ము. (నబాబును దీసికొనిపోవును.) (వారు తిరిగి ప్రవేశింతురు.)

నబా:—ప్రభూ ! నాబుద్ధిలోపమును క్షమింపుఁడు. మీరు దాని గర్భమునుజీల్చి, లోపలిపిల్లను సులభముగఁజూపి, తిరిగి గుఱ్ఱమును, పిల్లను ఎప్పటియట్ల నుండఁజేసిరి. మీమహిమ దెలియక మూఢుఁడనై యిట్లు జేసితి.

సిద్ధు:—సర్కార్ ! ఇట్టి పరీక్షల కెన్నఁడును బూనకుఁడు. విజ్ఞానముచే భక్తి కుదురకున్న, మహిమలఁ బ్రదర్శించుటచే భక్తి కుదురఁజాలదు. కుదిరినను నిర్మలముగ నుండదు.

నబా:—గురూజీ ! నాసలాములందుకొని నన్ను క్షమింపుఁడు. నారాజ్యములో మీ రేదికోరిన దానినిచ్చెదను. కోరుకొనుఁడు.

వీ॥బ్ర:—నా కేదియుఁ గోరఁదగినది గాన్పించుటలేదు. కొంతకాలము వాటిలి నపుడు వర్తమాన మంపెదలెండు.

నబా:—(చెంపలు వేసికొని) గురూజీ! అపరాధము. మీరుఁ గొంత గల్గుట, నేఁదీర్చుటయా? మీరడుగుట, నేనిచ్చుటయునా? మీ రాశ్రితులరు, నేను దాతనా ? — ఎంత పొరపాటుమాటాడితిని. నాకున్న సర్వస్వమును మీరనుగ్రహించి యొసఁగినది కాదా? నీవు జగన్నియంతవు, విశ్వేశ్వరుఁడవు. విశ్వవంద్యుఁడవు. అయినను నాకృతజ్ఞతఁజూపి ధన్యుఁడనగుటకు నేనొసఁగుదానము పరిగ్రహింపుఁడు.

వీ॥బ్ర:—దానమును నే నర్థింపను.

నబా:—గురూజీ! మీ రర్థించుటగాదు. నాప్రార్థనము నంగీకరింపుఁడు. నాయంతనేనే కందిమల్లయపాలెముచెంత నొక మఠము నిర్మింపఁజేయుదును. అందు మీచిత్తముచొప్పున వసింప ననుగ్రహింపుఁడు. అమఠ మెట్లుండవలయునో సూచింపుఁడు.

వీ॥బ్ర:—ఆలోచించి తెలిపెదము.

నబా:—చిట్టచివరి వరము, ఈపురమున మిమ్మూరేగింప నంగీకరించి, నన్నును, నా ప్రజలను, గృపఁజూడుఁడు.

అందఱు:—శ్రీ వీరబ్రహ్మేంద్రస్వాములవారికి జై !!

(తెరపడును.)

ఇది సప్తమాంకము.

# బ్రహ్మానందలీలలు

## అష్టమాంకము.

మొదటి రంగము.

(కంది మల్లయ్యపల్లెమఠము. ఓంకారయ్య, పోతులూరయ్య, కృష్ణవర్మ, రామశర్మ, ప్రవేశింతురు.)

పోతు:—మిత్రులారా! మేము పుత్రులమైనందునను, మీరు శిష్యులైనందులకును, కృతార్థులము కావలయుకాల మాసన్నమైనది. కాని—

ఉ॥ అన్నిట సిద్ధుఁడే మనకు నడ్డము; తండ్రిక వానిమీఁదనే
యున్నటుదోఁచు బ్రేమ; మెటులో యిఁక నిత్తఱిదేశికేంద్రు సం
పన్నమహోపదేశము లపారముగాఁ గొని, యెల్లసిద్ధులం
దున్నతిగాంచి, యందఱు నహో! యనిమెచ్చ యశమ్మునందుటల్?

కానిండు—అయినను

తే॥ గీ॥ వీరగురుఁడు సమాధిని జేరువేళ
నతఁడు లేకున్నఁ గోర్కుల నందవచ్చుఁ;
గాన సిద్ధుని యెచ్చటి కేనిఁ బంపు
నొకయుపాయము జింతించు టొప్పు మనకు;

రామ:—ఆమాట నిజము! వాఁడెప్పుడును స్వామివారి నెడ బాయడు. అతఁడు వద్దనున్న మనకుఁ బూర్ణబోధ చిక్కదు.

కృష్ణ:—అదేవచ్చినబాధ. వానినెటులైన గురునుండి యెడబాపవలయును.

ఓంకా:—సోదరులారా! సిద్ధునిఁగూర్చి, మీరేల యిట్లు కపటాలోచనలు సేయుట?

సీ॥ కరణంబుచేతిలోఁ, గట్టుపడ్డను గూడఁ
బులినుండి యాలఁ దాఁ బ్రోచునాఁడు,
అల పుష్పగిరిని, విప్రులపీఁచము నడంప
గృహదాహ మతఁడు శపించునాఁడు,
గురునాజ్ఞచే, మండు కొలిమిలో మూసను
దాఁదెచ్చి లోహముఁ ద్రావునాఁడు,
"కడప"ప్రోల, నబాబు కచ్చేరిలోఁ దాను
జ్ఞానబోధనలకుఁ బూనునాఁడు,
తే। గీ॥ కలిగిన పరాభవము, శాస్తి, పలుచఁదనము,
చాలదే? యింక నతని వంచనయొనర్పఁ
జూడకుఁడు! ప్రాప్తముండిన చో లభింప
నట్టియర్థములున్నె? యే పట్టునైన;

పోతు:—అన్నా! అంతమాత్రముననే యాతఁడు ఘనుఁడైపోయెనా? అవియెల్లఁ దండ్రిగారియనుగ్రహముననే చేకూరినవిగాని, సిద్ధుని శక్తివలనఁ గాదు. నీవు ప్రస్తుతమునకడ్డము చెప్పవలదు.

రామ:—ఏదియోయొక మిషచేతనైన సిద్ధుని సమ్మతిపఱచి, గురువుగారు జీవసమాధిఁబ్రవేశించులగ్నకాలమున నతని లేకుండఁ జూడవలసినదే!

కృష్ణ:—ఆందఱికిని గోరికయొక్కటేగాని యుపాయము మాత్రము దోఁచలేదు. ఉపాయము తోఁచినను, దానినాచరణలోఁబెట్టు సాహసముండవలయును.

పోతు:—సాహసము కావలసినచో నన్నుబిలువుఁడు. మీరేమి యూహించిరో చెప్పుఁడు.

రామ:—జీవసమాధిని బ్రవేశించుటకుఁబూర్వము శివపూజ నిర్వర్తింతురుగదా; ఇది వైశాఖమాసము. ఈప్రాంతములనెక్కడను బూలు దొరకవు. బనగానపల్లెలోఁ గావలసినన్ని పూలు లభించునని చెప్పి, వాని కొఱకై సిద్ధునిఁ బంపుము.

పోతు:—ఇందులకుఁ బెద్దన్నయుఁ దల్లిగారును, ఒప్పుకొన్నఁగాని సిద్ధుఁడుపోఁడు. వారిని నేనొడంబఱచి, వానిని బంపివేసెదను.

కృష్ణ:—నీవు మిక్కిలి తొందరపడుదువు. గుట్టు బయటపడునేమో ?

ఓంకా:—ఇంతకును మీరు చేయుకుట్రలు న్యాయమా?

రామ:—ఓహో ! మీరు న్యాయమైన కుట్రలుకొన్ని పన్నుదురు గాఁబోలు

కృష్ణ:— కొంప ముంచునట్లున్నావే ! చివరికంతయును మాపైఁ ద్రోసెదవా ?

ఓంకా:—మీయిష్టము. నాకునసహాయ్యపటలేదు. నేనుకాదనను. కద్దనను. ఈవిషయమున మూకీభావమే నాశక్తికిఁదగినది. నేనుపోయెదను. మీరెట్లైనను జేసికొనుఁడు ! (పోవును.)

పోతు:—నేను పోయి తల్లిగారితోఁ బూలావశ్యకమని చెప్పి యొప్పింతును. సిద్ధునికిమాఱుగా సమాధికార్యములఁజూడ నేనుండి వానిని బంపి పూలు తెప్పింతునని యొడంబఱచెద.

రామ:—ఇది మంచియెత్తు! ఈతఁడుపాయశాలి కాదందురే? మనం దఱికంటె మేటి యితఁడే !

పోతు:—నేను పోవుచున్నాను. మీరు మీమీపనులమీఁదనుండుఁడు.

(అందఱు పోవుచుండ సిద్ధుఁడు ప్రవేశించును.)

సిద్ధు:—(సంతోషముతో) ఆహాహా ! !

తే॥ గీ॥ సచ్చిదానందరూపుఁడు ♦ సద్గురుండు
తాను జీవసమాధియౌ ♦ తరుణ మిదియ!
నేటితో ధన్యతగాంచు, ♦ నిరుపమాన
మోక్షసామ్రాజ్యపట్టాభి ♦ ముఖ్య మెలమి;

పాట॥ ...........................................
అరయ నాలుకజిడ్డు అంటియంటని యట్లు,
పొరలుతామర నీరుఁ బొందనట్లు,
గరిమ బూడిదగచ్చ కాయకంటని యట్లు,
బురదయు కుమ్మరపురుగు నంటనిరీతి,

పొరలుసంసారంబు బొరయుచుండెడియోగి,
అరసి కోరికలందు నంటీయుంటకుండు॥

పోతు:—అన్నా ! సిద్ధా ! ఏమి, తీకగాఁబాటలు పాడుచున్నావు ?

సిద్ధు:—ఇప్పుడే అమ్మగారు పంపినది. సమాధిమీఁదికిఁ గప్పురాతిని దీసుకొనిరాఁబోవుచున్నాను.

పోతు:—ఆ ఆాతిని నేను దెచ్చియిత్తును. అమ్మగారు నిన్ను త్వరగాఁ బోయిరమ్మన్నది.

సిద్ధు—ఎక్కడకు ?

పోతు:—బనగానపల్లెకు.

సిద్ధు:—ఎందుకు ?

పోతు:—రేపు పూజకడువిలాసముగఁ జరుగవలెనుగదా ! భక్తులు వేల కొలఁదివచ్చుచున్నారు. ఆశ్చర్యముగనున్నది !

సిద్ధు:—ఆశ్చర్యమేమున్నది? గురుఁడు జీవసమాధిని బ్రవేశించునని వాడవాడలవారికిఁ దెలిసిపోయినది. వేలకొలఁదిగ భక్తులు వచ్చుట సహజమే.

పోతు:—పూజమాటేమందువు ?

సిద్ధు:—పూజ జరుగుటకేమి ?

పోతు:—పూలు పత్రి లేని పూజయా ?

సిద్ధు:—అవెందుకుండవు ? కావలసినన్ని లభించును.

పోతు:—ఈప్రాంతమునఁ గావలసినన్నిపూలెక్కడివి ?

సిద్ధు:—అందుకా, అమ్మగారు నన్ను బనగానపల్లె పొమ్మనుట ?

పోతు:—మఱెందుకనుకొంటివి?

సిద్ధు:—తప్పక పోయివచ్చెదను. అక్కడిపూలతోఁట పేరెన్నికగాంచినది.

పోతు:—సత్వరముపోయి, వేళకురావలయును.

సిద్ధు:—ఇదే పోవుచున్నాను. అమ్మ వెళ్ళుమనెనా ?

పోతు:—అవును.

సిద్ధు:—ఎంతదూరము బనగానపల్లె ? సకాలమునకు రాఁగలనా ?

పోతు:— సరి, సరి? ఈ గణితముతో సమయము సరిపెట్టెదవా? నేను పోయివత్తునాయేమి?

సిద్ధు:—తల్లి నన్నుబొమ్మన్న నేను వెనుకాడుదునా? ఇదేపోవు చున్నాను. (పద్విషుసు)

పోతు:—నా తెలివి చూచుకొనుఁడు! నిమిషములోఁ దల్లినోడంబఱచి తిని. గోవిందయ్యయు వల్లెయనె. మాపన్నుగడ యెందులకో గ్రహించినవారు కారు. సమాధినిర్మాణమున సంరంభముతో మునిఁగియున్నారు. ఇఁక నే జనకుని కడకేగెద.

(నిష్క్రమించును.)

(తెర పడును.)

---

## రెండవరంగము.

(సమాధిసమీపము. శ్రీవీరబ్రహ్మేంద్రస్వామి, గోవిందమాంబ, అయిదుగురు పుత్రులు, అనేకులు శిష్యులు, ఈశ్వరమ్మ, వీరనారాయణమ్మ, ఉచితరీతి సమావేశమై యుందురు.)

వీ|బ్ర:—గోవిందా! నీకూఁతురు ఈశ్వరమ్మ యెక్కడ?

గోవిం:—ఇదిగో! ఇక్కడనే యున్నది. అమ్మాయీ! తాతగారు పిలుచుచున్నారు.

ఈశ్వ:—తాతగారూ! నమస్కారము! ఎందులకుఁ బిలిచితిరి?

వీ|బ్ర:—అమ్మా! ఈశ్వరీ!

తే|| గీ|| ఆదిశక్తియీశ్వరియంశ ♦ మందినీవు
జననమైతివి, పుడమిస ♦ జ్జనులఁబ్రోవ;
తల్లి! నీమూలమున నెన్నొ ♦ ధర్మము లిలఁ
బాదుకొని, లోకవృత్తమే ♦ ర్పఱుప వలయు;

ఈశ్వ:—అయ్యది మీయనుగ్రహము !

వీ|బ్రి:—అయినను, నీలో నఖండజ్ఞానతేజమున్నది, దానిని స్మరింపుము.

ఈశ్వ:—స్మరించినమాత్రమున, దేజము ప్రసన్నమగునా ?

వీ|బ్ర:—నేఁ జనినవెనుకఁగాని నీమహిమలు నీకుఁదెలియవు. కాన జాగరూకతగలిగి వర్తింపుము. మఱియు—

చం|| చిఱుత తనమ్మునుండి యిటఁ ♦ జేరి, యనర్గళభక్తియుక్తుఁడై
గురుపదసేవయే దనకుఁ♦గూర్చెడు మోక్షమునంచు నమ్మి, యే
కరణిఁబరీక్షచేసినను ♦ గాని విపత్తులకోర్చి, యన్నిటన్
దిరమగు ప్రజ్ఞతోడఁగడ ♦ తేఱినసిద్ధునిఁ గాచియుండుమీ!

ఈశ్వ:—నీవుండఁగా నీవుచెప్పినట్లు చేయుచుంటిని. నీవు కాన్పింపక దాఁగెదవుగదా? ఇఁక నే నెవరివలన బోధలునేర్చుట?

వీ|బ్ర:—బోధలన్నియు నీలోనుండియే యావిర్భవింపఁ గలవు. రత్నము ప్రకాశమునన్వేషింపదుగదా ? గోవిందా! ఇఁకమీఁదట నీ తమ్ములును నీవును మీతల్లియానతిని బాటింపుఁడు. ఏమఱకుఁడు. మీయమ్మను రమ్మనుము.

గోవిం:—మహాప్రసాదము! తల్లీ ! ఇటురమ్మ.

గోవిందమ్మ:—నాధా! వందనములు.

వీ|బ్రి:—గృహస్థులు కేవలము విషయలోలురై తమధర్మములను విస్మరించిరి. నీవు కొమరుల కాదర్శగార్హస్థ్యము నుపదేశించి, తద్ద్వారా గృహస్థలోకము నుద్ధరింపుము. నేనిదివరకుఁ జెప్పిన యంశముల గుర్తింపుము.—అమ్మా ! వీరనారయణీ !

వీ|నా:—తండ్రి ! ఇదిగో, వచ్చితిని. నమస్కారము. (ఏడ్చును.)

వీ|బ్రి:—ఆహా ! ఏటియజ్ఞానమిది ? ఇటురమ్మ. (చెవిలో) ...సంతాన మీమతమున కాధిపత్యము వహించును. ఈరహస్యము నెందును వెల్లడింపకుము.

పోతు:—తండ్రి ! నేనేమిచేయవలయును ?

వీ|బ్రి:—జనని యానతి ననువర్తింపుఁడని చెప్పియుంటినిగదా ? మఱలఁ బృచ్ఛింతువేల ?

పోతు:—(తనలో) నాప్రయత్నము విఫలమైనది. నడిమియన్న పల్కులే సత్యమైనవి. తండ్రియెదుట నాసాహసము గూడఁ గుంటువడు చున్నదే !

1. శిష్యు:—సద్గురుప్రభూ ! నీవుండఁగ నీశక్తి యప్రతిహతమై తేజరిలుచు, మమ్ముఁగాపాడినది. ఇఁకమీఁదటమాకు దిక్కెవ్వరు ?

వీ|బ్ర:—ఎంతటి యవిశ్వాసము! మిమ్మింత దనుకఁగాచిన శక్తి, యిపుడేమి కానున్నది? అది త్రికాలాబాధితమై యేకరీతిని వెలుఁగు నదేగదా! మఱచితిరా? మీరాశక్తిని సంస్మరించి యాదిశకుఁ దిరిగితిరా, అది సర్వదా ప్రత్యక్షముగనే యుండును. దేహాదుల స్మరించి పరాఙ్ముఖు లైతిరా, అది మీ క ప్రత్యక్షమైయుండును. సూర్యునివలన దివారాత్రము లేర్పడుటలేదుగదా? ఈ భూభాగము, అయ్యాదిత్యునివైపు తిరుగుచో దివమును, అందుండి మఱలుచో నిశను దాన కల్పించుకొనుటలేదా? ఆ దివాకరుఁడు దివాకరుఁడుగాఁడు. మీకు మీరే దివాకరులు! భ్రాంతులవీడి ప్రబుద్ధులై సదా మనుఁడు!

2. శిష్యు:—స్వామీ ! విప్రులయుద్ధతి కోర్వఁజాలము. వారు మత్సరపూర్ణులు.

వీ|బ్ర:—పరమార్థమున స్పర్ధలుండవు. మోక్షపథమున నెవరి కెవరడ్డు దగులఁగలరు? సర్వత్ర వెల్లువగట్టి ప్రవహించు గంగయొడ్డునఁ గూర్చుండి, మాదప్పి తీర్చుకొనకుండ నడ్డుగల్గునేమొ యని తల్లడమందుదురా? ఎవరిత్రోవను వారుపొందు; మూఢులై, ఎవ రేని యవరోధములఁ గల్పింతురేని సర్వేశ్వరుం దలంచి, భక్తి విశ్వాసములఁబెంచి, యాత్మగమనము సాఁగింపుఁడు.

2. శిష్యు:—అనంతరము జరుగవలయు నేర్పాటుల సెలవీయ వేడెదను దండ్రీ!

వీ|బ్ర:—(నవ్వుచు) అణువునందుఁ బ్రకాశించువాఁడు, మహత్తునందు మహిమ గాంచఁగలఁడు. మహత్తునందుఁ బ్రకాశింపఁ జూచు

నతఁడు, అణువునం దణఁగిపోవుచున్నాఁడు! మోక్షమార్గము స్వార్థపరులకు ఇఱుకైయుండును. పరార్థ సాధకులకుఁ గడుం గడు విశాలమైనదే! ధర్మమే మిమ్మునడపు ధ్రువనక్షత్రమై యుండఁగాని! తదన్యంబగు నాడంబరమంతయు మీరు పేక్షింపవలయును. ఒకరిని గాదని ముందునకుఁ బఱ్వడి మోక్ష మార్గమునఁ జొరఁబాఱఁ జూచునతఁడు, తన లోభవృత్తిచేతనే వెనుకఁబడిపోవును.

ఒకప్రేక్షకుఁడు:—సర్వసారభూతమగు ధర్మవాక్య మొకటి సెలవిండు!

వీ।బ్ర:—సర్వభూతములందును దనను జూచుకొనువాఁడే, చూచు వాఁడు! తన తనువునమాత్రము తననుజూచుకొనువాఁడు గ్రుడ్డి వాఁడు.

అందఱు:—శ్రీ విరాట్పోతులూరు వీరబ్రహ్మేంద్ర స్వాములవారికి జై!

వీ।బ్ర:—(అందఱితోడను)

శ్లో। తపోయజ్ఞ దానాదిభిశ్శుద్ధబుద్ధి
ర్విరక్తో నృపాదౌ పదే తుచ్ఛ బుద్ధ్యా,
పరిత్యజ్య సర్వం యదాప్నోతి తత్వమ్,
పరబ్రహ్మనిత్యం తదేవాహమస్మి॥

అందఱు:—శ్రీజగద్గురు వీరబ్రహ్మేంద్రులకు జై!

వీ।బ్ర:—కోలాహలము మానుఁడు. భగవత్సంకీర్తనము సేయుఁడు. నాయుపన్యాసములుమీరు పల్మరు వినియేయున్నారు. దేహాత్మ భ్రాంతిమాత్రము దరిరానీకుఁడు. ప్రతివానియంతరాత్మయు ముక్తిమార్గమునే సూచించుచుండును. త్రికరణములకు సదా సామరస్యముంగూర్చి వర్తింపుఁడు, చాలును: అప్పుడునఁ ద్వరలో నందఱును ముక్తిమార్గమును జేరఁగలరు. —నిశ్చితలగ్నము సమీపించినది. నేను సమాధిని బ్రవేశించుచున్నాను. పైని మూఁతతాలు గప్పుఁడు (సమాధిలోనికరిగి) పుత్రులారా! ఒక్క విషయము:— నాగురువరేణ్యుఁడు— వీరభద్రస్వామి,

"అల్లామపల్లె"యందున్నాఁడు.మీరేటేట నటకేగి నాగురుదక్షిణ
గాఁ గానుకలజెల్లింపుఁడు!

అందఱు:—

పాట॥ శ్రీవీరగురుదేవ ! తుభ్యం నమో నమో,
సేవాసంప్రీతాయ, తుభ్యం నమో ॥శ్రీ॥
వేదాంతవేద్యాయ, బోధైక గమ్యాయ,
మోదమానభక్త మోక్షదాయ, ॥శ్రీ॥
సకలచరాచర సాక్షిస్వరూపాయ,
ప్రకటనిర్గుణతత్వ భావనాయ ॥శ్రీ॥

శ్రీసద్గురుదేవునకు జై !

(తెరపడును.)

---

## మూడవ రంగము.

(సమాధికడ సిద్ధుఁడేడ్చుచునుండును.)

సిద్ధు:—కటకటా! ఎంతమోసమయ్యె! నేను పూలకుఁబోఁగా గురుఁడు
సమాధిని బ్రవేశించినాఁడు. ఇంకెవరు నాకుదిక్కు? అయ్యో!

తే॥ గీ॥ గతభవార్జిత మైనట్టి ♦ కలుషరాశి
పండి, విషమయి, త్రావఁగాఁ ♦ బట్టుకొన్న
యీసుధాభాండమునఁ బడె ♦ నేమొ? కాక
కలుగునే మిట్లుతుదకు వి ♦ ఘ్నములునాకు?

తే॥ గీ॥ ప్రళయజలరాశివలె నేరు ♦ పథమునందు
నడ్డమై కొంతసమయంబు ♦ నపహరించె;
పూలు దొరకమిగతియించి ♦ పోయెఁగొంత
వేళ; మిగిలెనె కడకిట్టి ♦ విషపుఘటిక?

మ॥ భరమై కన్పడుజీవితం బిపుడు; వి ♦ శ్వంబంత తామిస్ర బం
ధురమై రూపటిపోయె; డెందమున నే ♦ దోభావనావేశముల్

జరియించుం, గరణీయమెద్దియును దోఁ ♦ చంబోదు; ప్రాణాలుని ష్ఠురతం ద్యాగముజేసి, యీతనువు ని ♦ చ్చోఁగాన్కగా వింతునా? గురువరేణ్యా! ఏమిది యిట్లు చేసితివి?

మ॥ పదిరెండేండ్లు తదేకదీక్షగనినుం ♦ బ్రార్థించి ప్రార్థించి, నీ
పదసంసేవన మాత్మముక్తియని సం ♦ భావించి, జీవించియు
న్నది యాశాఫల మిట్లుగోల్పడుటకే ♦ నా?తండ్రి! యీహైన్యతా
స్పదమౌ జీవనమేల నాకిపుడు? తు ♦ చ్ఛంబిద్ది పోనాడెదన్;

బాపురే! ఎంతటిమాయలు పన్నినాఁడు పోతులూరయ్యా! అమ్మ పూలనుదెమ్మనె నఁటగాని, బనగానపల్లెకుఁ బొమ్మన లేదే? ఈపోతులూరయ్య నన్నేల మోసగించవలె? వీని నిప్పు డేమి సేయుదును?—ఏమీ! వెక్కిరింపవచ్చితివా? నిలునిలు, మోసగించిన ఫలము ననుభవింతువుగాని,—నేనొక్క గంతు వేయునప్పటికే మఱిపోయినాఁడు—మఱచిపోయితినే, త్వరగాఁ బూజకుఁబోవలయును.

పాట॥ పూజకు నేనొస్తి, బ్రిహ్మము పూజకు నేనొస్తి;
పూజకు నేనొస్తి పున్నమవెన్నెల
కాయవిశుద్ధిని గలిగెడువస్తువ ॥పూ॥
ఏడుమెట్ల నిచ్చెనవేసుక
వెలుఁగుదాఁటి పువ్వులుగోసుక,
అఖండతేజము వెలిఁగెడు గురునకు
ఆత్మపూజలు జేసేటందుకు ॥పూ॥

తే॥ గీ॥ సద్గురూత్తముఁ బూజలు ♦ సలుపుకొఱకు
పూలుఫలములు పత్రిచేఁ ♦ బూనిభక్తి
తోడఁ జనుదెంచితిని; గురుఁ ♦ డేఁడి ? నాకుఁ
గానరాఁడెంత వెదకినఁ ♦ గానియిచట ;

ఏఁడీ ? ఏఁడీ ? నా వీరబ్రిహ్మగురుఁడు ? ఎక్కడ ? ఎక్కడ ? అదుగో ! అదుగో ! !

(కన్నుమూసి కూర్చొండి)

పాట। నేఁజూచినానే, బ్రహ్మమునాలో, నేఁజూచినానే,
సద్గురునాలో, నేఁజూచినానే॥
నేఁజూచినానమ్మ! నెలతరో తారక
రాజయోగమునందు రంజిల్లునాగురుని ॥నే॥
చక్షురాగ్రమునందుఁ బశ్చిమవీధిన
నిక్షేపమైవెలుఁగు సాక్షిభూతునినాలో ॥నే॥

తే॥ గీ॥ యోగపరిపూతదృక్కులై ♦ యున్నసంయ
మీంద్రులెవ్వానిఁ బొడగాంత్రు ♦ హృదయసీమ ;
అట్టిబ్రహ్మము-సద్గురు, ♦ నాత్మలోనఁ
జూచినాఁడను, లోపలి ♦ చూపుతోడ ;

(ఇటునటు రిచ్చపడిచూచి)

అరరే! పోయినాఁడు. పాఱిపోయినాఁడు. నాహృత్కమలములోనుండి వెడలిపోయినాఁడు. ఆహా! ఎట్లుపోఁగలిగె? తెలియరాదయ్యెనే! అయ్యో! పరవశత్వమునఁ బ్రాల్మాలితిని. నాకర్మము; నాగతియింతియె! చిక్కినప్పుడు మదిఁజిక్కపట్టలేనైతిని. నాప్రారబ్ధము అదుగో! అదుగో! గురుఁడు కొంచెము మతినిలిపిచూచినఁగనఁబడుచున్నాఁడే. వానినే అనన్యమనస్కుఁడనై చింతించెదను. అదే, మంచియుపాయము. బలే! బలే! మంచియుపాయము! బ్రహ్మం! బ్రహ్మం! గురుదేవా! ఇంకెందుఁ బోదువు? నీకొఱకేగదా పోయిపోయి, బనగానపల్లెకుఁబోయి, అడవులు దాఁటి,గుట్టలు గమించి, కనుమలనెక్కి, ఎంతోకష్టపడి పూలనుదెచ్చినాను. మంచి మంచిపూలు తెచ్చితిని. ఇవిగో! వీనిని నీవుతీసికొని శివపూజచేసికొనుము—ఛీ. ఛీ. ఈధోరణియేమి? నీసంకల్పములన్నియు నన్నితోవలఁ బరుగిడుచున్నవి; అడవులు, ఱాళ్ళు, రప్పలు, హృదయఫలకమునఁజేరినవి. ఓరీ సిద్ధా! ఓరీసిద్ధా! నీవెంతయు మూర్ఖుఁడవు. ఱాళ్ళురప్పలు నిండి,

సద్గురురాయని నీహృదయమునుండి తోసివేసినవి.—అయ్యో! అయ్యో! నాగురుఁడు, నాగురుఁడు; నాదైవము! నాయిష్టదైవము! నాప్రాణము. పోయెను! పోయెను. నాప్రాణము పోయెను. ఇంకేమున్నది ?శరీరము మిగిలినది. నేనువట్టిశవుఁగను.—పీనుగనా ? పీనుగయిట్లుమాట్లాడునా ? ఇట్లుతిరుగునా? ఇట్లు విలపించునా ? కాదుకాదు. నేనుబ్రతికియేయున్నాను,—అయినఁ బ్రాణమున్న ఫలమేమి ? జీవుఁడేడి ? జీవునికిఁ దోడా పరబ్రహ్మమెక్కడ ? మాయ ! అంతామాయ ! మాయ దట్టముగా నున్నది. దీనిపొగరణఁచి, దీనిని పలుచన సేయవలయును. అపుడు సత్యస్వరూపునిజాడ కానవచ్చును.—సరే, సరే, నాకర్మము, నాకర్మము, నాదుష్కర్మము. కాకున్న ఇటుకాన్పించిన ఆజాడతప్పిపోవునా ? మాయా ఆవరణతిరిగి కప్పివేయునా? ఓరీసిద్ధా ! సిద్ధా ! నీకొక యుపాయము జెప్పెద విందువా ? వింటివా ? సరి ; మాయాపటములు పలుచన కాఁగనె ఆత్మరూపునిజాడపై దృష్టినిలిపి, తీక్ష్ణ దృష్టి నిసారించి, మాయను చిమ్మివేయుము: ఆదృశ్యబింబము బాగుగఁ దేజరిల్లును. దానిని నిటలమునబంధించి యానందింపుము. మైమఱచుము, నీవును, నీగురుఁడును, నేకాంతమున నిలువుఁడు అన్యులనుగాని, అన్యచింతనమునుగాని, హృదయపథమునఁ జొర రానీయకుము.—ఇంకేమున్నది. ఇంకేమున్నది ? నాగురుఁడేకాంతమున—నాయంతరంగమున నిండెనా, నానోముఫలించినట్లే. సముద్రములో లవణము కరఁగినట్లు, సూర్యకాంతిలోఁ గర్పూరనీరాజనము లయమైనట్లు, నేనును నాగురుదేవుఁడు నేకమై పోదుము. అదే, అదే మంచియుపాయము !

పాట॥ మాయనునఱికిన వాఁడు, గురు,
రాయనిలో జతగూఁడు;
పాయుచువిషయము రోయుచుసతతము
ఏయెడఁజూచిన నేకముతానై ॥మా॥

కుండలినిటు భేదించి, అ
ఖండముగను భావించి
అండపిండ బ్రహ్మాండము లంతట
నిండిపండియా నిర్వికల్పమున ॥మా॥

శా॥ మాయాకల్పితనామరూపముల సం ♦ బంధంబు బోనాడి, యే
యాయాసంబును లేక, మానసము నా ♦ త్మాధీనముం జేసి, యా
ప్యాయంబెంతయుఁ గాంచి, నెల్లెడనఖం ♦ డానందసత్తాకమై
ధ్యేయంబై వెలుఁగొందుతత్వమది నే ♦ నే! యంచు మోదించెదన్.

ఇంక నాకేమికొదువ ? ఆహా ! హా !

(ఆనందమున మగ్నుఁడై కూర్చుండును.)

(సమాధినుండి ధ్వని వెలువడును.)

ధ్వని:—సిద్ధా ! నీచిత్తసంయమమునకు మెచ్చితిని. నీభక్తికి సంతుష్టిఁ జెందితిని. నీశ్రద్ధకు సంతసించితిని. కొలఁదికాలములోనే జీవన్ముక్తుఁడ వగుదువు. బిడ్డా ! అడలకుము.

సిద్ధు:—ఎవరా మాటాడినది ? ఎవరి పలుకులివి ? నాగురురాయని వచనములేనే యివి. ఏఁడీ ? ఎక్కడనున్నాఁడు ? ఇక్కడ ! ఈసమాధిలో ! అవునవును. ఇందుండియే ఆస్వరము బయలు దేఱినది. నాగురునికినాపై నెంతప్రేమ ? నన్ను బుజ్జగించి లాలించినాఁడే! కౌఁగిలించుకొని పట్టువిడువను (చేతులు సాచి) అయ్యో ! ఏఁడీ ? ఏఁడీ ? మఱల పోయినాఁడే. నన్నెడబాసినాఁడే. నేను మనోవీధినిఁదాటి దిగి స్థూలమునకు రాఁగనే గురుఁడు పాఱిపోవుచున్నాఁడు. నాతోడ దాఁగుడుమూఁతలాడ సాఁగినాఁడు. దాఁగుడుమూఁతలాటలోఁ దల్లినిదాఁకలేక దొంగచేఁ బడ్డ బిడ్డ గతియైనదే నాదశ. అట్టి బాలకుఁడు ఏడ్చినట్లు నాకేడ్పు వచ్చుచున్నది. తల్లినిజేరి కదలకుండ గూర్చుండు యుక్తి చిక్కలేదు. చిక్కు ఇంకను విడలేదు—ఓరీమూర్ఖా ! నీకెంతటి యాశ ? పేరాసలఁ గొనువారందఱిగతియు నిట్లే

యుండును సుమీ! సద్గురు సాక్షాత్కారమైనప్పుడు ఇం ద్రియాటోపముల నడంచి , మదిదిట్టపరచి గురుపాదముల హృదిని బ్రతిష్ఠించి, పూజింపఁజాలకపోతివే ? పార్థివదేహము నకు దిగి గురునాలింగనముచేయ జేతులు బారలుచాచుచువా? ఛీ, ఛీ. ఆహా ! తెలిసె, తెలిసె; నీమాహాత్మ్యము తెలియవచ్చె అది మాయయొక్క మోసము మాయా! ఓ మాయా! ఏదీ నీపరితాపము ? ఇపుడు చూపుము. ఇంకనీయాటలు సాఁగవు లెమ్ము. సద్గురుదేవునాన! నీవుతొలఁగిపొమ్ము. నేనిట్లు గూర్చుండి నిస్సంకల్పుఁడనై బ్రహ్మావలోకనముఁ జేసెదఁగాక. (కదలక కూర్చుండును. సమాధినుండి ధ్వనివినవచ్చును.)

ధ్వని:—బిడ్డా! అయ్యదియే మార్గము. చలింపకుము! ప్రజ్ఞను నిలిపి కొనుము. సాధనము విడువకుము. దిగులుజెందక నిరాశకుఁజో టీక మాయాతంత్రములకు లొంగక, స్థితప్రజ్ఞుండ వగుము. నే నిదివరకుఁ జూపియున్న త్రోవయే త్రోవ. సంశయింపకుము. ఉత్తరమార్గమును, ఈశ్వరి నీకు బోధింపఁగలదు. నీవుధన్యుఁ డవు కాఁగలవు. నిత్యసంతుష్టుఁడవై మెలఁగుము. భక్తిసాధ నములు సయితము నిష్కామములై పఱఁగవలయుననుటను మఱువకుము.

సిద్ధు:—ఓహోహోహో! ఏమి నాయదృష్టము! ధన్యోస్మి! ధన్యోస్మి!! ఇఁక నాకేమికొదువ? ఇటువలెఁగదా యుండవలె గురుకటా క్షము! లోకములన్నియు, బ్రహ్మాండములన్నియు, నాలోనే జూపినాఁడే! సర్వమును నాయందే, నాస్వాధీనమందే యుంటఁ దెలిపినాఁడే. క్షుద్రస్వార్థము లింకేడ? విషాదములేడ? అఖం డానందమేడ ? అఖండానందమే నన్నలముకొని యున్నది ! అబ్బా!! నేనాయఖండమూర్తినే!!! అండాండపిండాడ బ్రహ్మాండ ములకెల్లను నే నానందదాయకుఁడనైతిని!

తే॥ గీ॥ ఈచరాచర విశ్వంబు ♦ లేయనంత
శక్తిలోఁబుట్టి, పెంపొంది, ♦ సమసిపోవు;
అట్టి నిర్ద్వంద్వమైన బ్ర ♦ హ్మమును నేన!
నేనె సర్వము! సర్వము ♦ నేనె!! నేనె!!!

ఈశుభసమయమున ఎల్లరకును స్వస్తినిగోరెద.

భరతవాక్యము.

ఆ॥ వె॥ ప్రకృతి దాస్యనిగళ♦బద్ధులై తమస్వత్వ
మునకు దూరులైన ♦ జనులు బంధ
ములుదొలంగఁ నాత్మ♦మోక్షసామ్రాజ్యంబు
జూఱగొందు్రగాత! ♦ ధీరులగుచు.

(తెర పడును.)

ఇది అష్టమాంకము.

శ్రీ బ్రహ్మానందలీలలు

సమాప్తము.



భారతీ ప్రెస్, తెనాలి.

# తప్పొప్పుల పట్టిక

| పుట. | బంతి. | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 2 | 2 | విచారించెదఁగాక | విచారించెదఁగాక. నటీ! నటీ! |
| 9 | 11 | చుట్టుకొట్టుంది | చుట్టుకొంటుంది |
| 11 | 12 | సంధ్యాఃఫల | సద్యఃఫల |
| ,, | 18 | పుట్టవందున | పుట్టువందున |
| 14 | 1 | మోక్షదంై | మోక్షదంబై |
| 19 | 7 | మద్రు | మంద్రు |
| 35 | 10 | అడ్రదుట్టం | ఆడ్రదుట్టం |
| 38 | 12 | రానువ్వదో | రానున్నదో |
| 51 | 7 | కొనలదంటిరా | కొనవలదంటిరా |
| 57 | 25 | చేసితిను | చేసితిని |
| 65 | 10 | జరాశంధాదులను | జరాసంధాదులను |
| [illegible] | 9 | వెడలిపోమె | నదలిపోమె |
| 67 | 10 | నయ బు | నయంబు |
| ,, | 20 | క్రియరొనర్తొ | క్రియలొనర్తొ |
| 69 | 9 | చేలీ | చెలీ |
| ,, | 26 | మనిమిద్దఱ | మనమిద్దఱ |
| 72 | 8 | అయిడ్డా దయ్యాం | అయిద్దా దయ్యాం |
| 73 | 2 | తీ స్త్క | తీస్క |
| 74 | 14 | రెుదూ్క | మొందూ్క |
| ,, | 15 | వొద్లూ | వొద్దూ |
| 98 | 20 | మీాకీ యగ్రహారమేల? | మీాకీ యాగ్రహమేల ? |
| 100 | 28 | ఆ పరమ్మా | ఆ పరమాత్మ |
| 101 | 16 | నుదు | ను. దు |
| ,, | 22 | నివాసనము | నివాసము |
| 105 | 16 | శ్రతుగణము | శత్రుగణము |
| 113 | 3 | నిలేకీతిని | లేనిరీతిని |

| | | | |
|---|---|---|---|
| 114 | 11 | దీననెట్లు | దీనినెట్లు |
| 115 | 1 | లోహాముమ | లోహామును |
| 119 | 13 | దదనుగుణాణ్యమగు | దదనుగుణ్యామగు |
| 121 | 19 | మాకు శ్వా | మాకు విశ్వా |
| 131 | 24 | నిశ్చిలత లగ్నము | నిశ్చిత లగ్నము |
| 133 | 23 | ఫలమలు | ఫలములు |
| 135 | 6 | విలసించునా | విలపించునా |

---



**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA123B124 |
| పుస్తకం పేరు | బ్రహ్మానందలీలలు |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 147 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Ch Ramya |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |